శ్రీ విరాట్ పోతులూరి

# వీరబ్రహ్మంగారి నాటకం

(ముత్యములవంటి మూడువందల గోవింద వాక్యములతో)


గ్రంథకర్త:

కీ॥ శే॥ కడియాల వీపూరయాచార్యులుగారు.

(బ్ర॥ పులికొండ పరబ్రహ్మకవిగారిచే సరిచూడబడినది)





వెలయువారు:

రఘు బుక్ షాప్స్, తెనాలి.

ప్రొప్రయిటర్స్: దుడ్డు కోటేశ్వరరావు అండ్ సన్స్.





1957

[ వెల 1-8-0

## ఈ నాటకమున వచ్చు పాత్రలు

పురుషులు:

1 ఏకాంబరయోగి
2. బ్రహ్మంగారు
3. సిద్ధుడు
4. గోవిందయ్య
5. పోతులూరయ్య
6. పీరుసాహెబు
7. హాస్యగాడు
8. సేవకుడు

స్త్రీలు

1. గోవిందమ్మ
2. ఈశ్వరమ్మ
3. ఆదంబీబి

సందర్భానుసారముగా మరికొందరు వచ్చెదరు.

శ్రీ ర స్తు

# శ్రీ పోతులూరి వీర బ్రహ్మంగారి నాటకం

విరాట్ స్తోత్రము

శంఖం చక్రగదా భయాంచితకరాన్ సన్లేఖినీం దక్షిణే
ఘకా్ౖకపాలకమండలుంచవరదం, వామేతపుస్తం తథా
బ్రహ్మేశాచ్యుత శక్రభానుపితరం, పంచాన్య మార్తాననం
విశ్వస్తవ్య మనంత మవ్యయమనాద్యం, విశ్వకర్మం, భజే.

శా॥ శ్రీమద్భక్త చకోరచంద్ర, సురరాట్సేవామిత ప్రాభవో
ద్దామానంత, విరాట్ స్వరూప, సరలత్వాతీతజ్ఞాన ప్రధా
వ్యోమాతీత నిరంజనా ! నిరుపమానోద్యత్కళాతీత ! నిన్
వేమారుల్ మదిలోఁదలంచెదను శ్రీ విశ్వేశ్వరా ! సర్వదా.

బ్రహ్మంగారి స్తోత్రము

గీ॥ భక్తి చేతులుజోడించి పాహి లోక
పూజితా ! యంచు శ్రీవిరాట్ పోతులూరి
వీర నారాయణా ! నినువేడువాడ
కరుణతో నన్ను నిరతంబు గావుమయ్య !

మనుబ్రహ్మ స్తోత్రము

శా॥ ఆద్యుండై పరతత్వరూపమున బ్రహ్మాండంబు సృష్టింపఁగా
నుద్యుక్తంబుగ లోహపంచకము దానుత్పత్తి గావించియున్
భేద్యంబెంతయుగాక సంతతము ఋగ్వేదంబు పాఠంబుగా
సద్యోజాతముఖాంశుఁడౌ మనువు నుత్సాహంబునన్ గొల్చెదన్.

మయబ్రహ్మ స్తోత్రము

ఉ॥ భూరి సమస్తదిక్కులను బొల్పుగఁగూర్ప ధరాస్థలిన్, మహా
ధీరత నుద్ధరింపగను దివ్యతరోన్నతశక్తి నెన్నియో
దారుమయైక చిత్రముల దా నొసరించియు జక్రహస్తుఁడై
కూరిమినింపు నామయుని కోరి భజించెద నిష్టసిద్ధికై.

త్వష్టబ్రహ్మ స్తోత్రము

ఉ॥ చూపులులేక పిండములు చోద్యముగా గనజాలవంచు మేల్
రూప్యుల జేయుచో సురగురుండయి మించియు, సామవేదము

ద్దీపనమొప్పగా నుడువు దివ్యకళా పరిపూర్ణ త్వష్టు, నా
ప్రాపని నమ్మికొల్చెద, శుభస్థితులీయ. సహర్నిశంబులన్.

శిల్పిబ్రహ్మ స్తోత్రము

ఉ॥ దేవ మహాస్వరూపముల దివ్య మహాస్థల యంత్రసంగత
స్థావర సారశిల్ప ఘనశాస్త్ర సమంచిత సత్ క్రియాచణో
ద్భావవిరాజి, తత్పురుష భాసితుడౌచు నథర్వణశ్రుతి
శ్రీ విలసిల్లు శిల్పి విధుజిత్తమునన్ స్మరియింతు భక్తితోన్.

దైవజ్ఞబ్రహ్మ స్తోత్రం

చ॥ సురనికరంబు వేడఁ గడు చోద్యమెలర్ప సువర్ణరత్న వి
స్ఫురిత మహోన్నతాభరణ సుందరసృష్టి సమగ్రభావ సు
స్థిర విభవోన్నతిన్ వెలుపు శ్రీమదఖండల తేజ నిత్య సం
భరితు, వసంతరూపు దయివజ్ఞుఁదలంతు నభీష్టసిద్ధికిన్.

విఘ్నేశ్వర ప్రార్థన

శా. విఘ్నధ్వాంతములెల్ల బాపరవియై, విఘ్నాహిరాట్ తార్క్ష్యుడై
విఘ్నాభ్రప్రళయానిల ప్రథితుడై, విఘ్నాబ్జశుభ్రాంశుడై
విఘ్నోత్తుంగ గిరీంద్ర వజ్రసిభుడై విఘ్నేశ్వర ఖ్యాతితో
విఘ్నారణ్య దవానలుండయిన యా విఘ్నేశ్వరుం గొల్పెదన్.

సరస్వతీ ప్రార్థన

చ॥ కులుకు మిటారిగబ్బి చనుగుబ్బల పైగల హేమరత్న స..
విలసిత మౌక్తికావళులు విభ్రమకాంతి నెసంగ, నల్మొగం
బుల దొరతోడి క్రీడదగు భోగవిహార విలాసవాణియా
పలుకువెలంది మా కొసగుభావ్య చమత్కృతి సంతతంబునున్.

అంబా ప్రార్థన - దరువు

1. అంబా ! నమః కాళికాంబా ! నమో, శివ
శంభునిరాణీ ! మదంబా ! నమో - జగదంబా నమో॥

2. కంబుకంధర గౌరి, కౌమారి, శాంకరి
అంభోజ నేత్రి ! జగదంబా నమో ! అంబా నమో॥

3. కాళి, మహాదనుజాళి, నిర్జిత రణ
కేళీ, దుర్గా, మహాకాళీ, నమో - అంబా నమో॥

4. కంకణ ఝుణఝుణ కింకిణీ రవహారీ
శాంకరీ, ఓంకార, శక్తి నమో - అంబా నమో
5. కందిమల్లయపుర, మందున వెలసిన
సుందరేశ్వరి దేవి శుభదే ? నమో, జగదంబా నమో॥
వ॥ అని యిష్టదేవతాభి వందనాదు లొనరించి. సద్గురుధ్యాన
పురస్సరంబుగా నొక్క పుణ్యపురుషుని సత్కథాప్రభావంబు
వివరింప దలంచుచుంటిన నొకింత మద్వంశావతారం బభివర్ణించెద.

వంశావళి

ఉ॥ శ్రీయుత విశ్వకర్మ కులసింధు సుధాకరమూర్తి, సాధు చి
చ్ఛ్రీయుఁడనేక శాస్త్ర పరిశీలుఁడు సత్కడియాలనామ వం
శాయత మల్లయాఖ్యుఁడగు నాతసికిన్ మహాలక్ష్మియందు ప
ద్మాయతనేత్రి కాళి వరమంది జనించితి ధారుణీస్థలిన్.
కం॥ శ్రీ పరమేశ్వర సన్మంత్రోపాసక శీలుడనయి యొప్పెడివాడన్
నాపేరు నుగ్గడింతును వీపూర్యాచార్యుడంచు విద్యావంతుల్.

గ్రంథకర్త ప్రోత్సాహకుల దెలుపుట

సీ॥ శ్రీ విశ్వకర్మవంశీయుడు కాశ్యప
గోత్రుండు డామను సూత్రుడైన
యాచార్యునకు పుల్లమాంబకు గొమరుడు
గురులింగ యాచారి, పరమసాధ్వి
యగు సుబ్బమాంబ సుతాగ్రణి పరిమి వీ
రాచారి యను పేర నలరుచుండి
భాసురమైన సుభాయిలాకా 'గని
యాత్మకూ' రను పురమందు నుండి
వసుధ గృష్ణానదీతీర వాసుడనగ బుధజనావళి లోపల పూజ్యుడయ్యు
శ్రీవిరాట్ పోతులూరి వీరేశు భక్తి పాత్రుడన మించె సజ్జనభావనుండు.
వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన శ్రీ విరాట్
పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి ప్రభావంబును నాటకా
లంకార సాహిత్యంబునఁ గథాప్రారంభంబెట్టి దనిన.

సీ॥ శ్రీకరంబైన యీకీర్తి మండలంబున
కడప జిల్లాయందు ఘనతనొప్పు
బద్వేలు తాలూక బహుళంబుగా నుండు
కందిమల్లయపల్లెయందు నెలయు
చున్న శ్రీమహోన్నతులగు వీరబ్రహ్మ
యోగీంద్రు విరచించి యుల్లమందు
వేడుకతోడ గోవిందమ్మను భజించి
యీశ్వరిచరణముల్ హెచ్చుగాను
నామదిని నమ్మి మ్రొక్కి యీ నాటకంబు
జేయబూనితి వారి యాశీస్సులంది
వినుటకై మరి వినుతింతు మదిదలంతు
కోర్కెలీడేర్చుడని వేడుకొందు నెపుడు.

పీతాంబర యోగిరాక, ద్విపద, ముఖారిరాగము

ద్విపద॥ వినరయ్య నా పూర్వ వృత్తాంతమెల్ల — జనము లెల్లను బహు శ్రద్ధాళురగుచు — గుమతుగా వినుపింతు కొన్ని సంగతులు — అరుదుగా నియ్యది యతిగోప్యతరము — మునుజన్మమున నేను ముదముతోడుతను — పనివడి బనగాన పల్లెలోనుండి—వీరప్ప యాచార్యు వేడ్క నర్చించి వారికటాక్ష దృగ్వాసన గలిగి — తిరిగి విచ్చేసిన దేశికస్వామి — తెరగుమీడక తదా దేశంబునంది — యాపీఠ గురు సభయంబు వేడుచును-సేవింపు చున్నాడ చిరకాలమయ్యె— పొందుమీరంగ నీభూలోకముననును—కందిమల్లయ పల్లెకడ నివసించు— కాలత్రయంబుల గల్గినయట్టి—చాల కాలజ్ఞాన సందర్భములును—విపరీతములును యీ విశ్వంబులోన — చపల మానసులను శక్తిరూపముల — హరియించుటాది మహాద్భుతంబులును — ధరణి వడంకుట తల్లక్రిందాట — అవనిలో పంచసహస్రవర్షముల — కవతరించియు బ్రహ్మమరుదెంచుటయును—మొదలుగాగల కొన్ని ముఖ్యాంశములును పదివేల గ్రంధ మేర్పరచెను మున్ను —విరివిగా కడియాల పీఠాధిపాఖ్య వరదుడౌ సద్గురు బ్రహ్మమిద్దరను

నవరోజు రాగం - ఆటతాళము - కీర్తన

వెడలివచ్చెను - ఏకాంబర యోగి । వెడలి ।

1. వెడలి వచ్చె తన జడలు మూపులు విడి, పుడమికి దూకుచు పాలు పొందగా । వెడలి ।
2. ఫాలభాగమున భసితపుండ్రములు, బాలశశాంకుని పగి చెలంగా ।వె।
3. ఉద్ధతముగ మోహనరుద్రాక్షసరుల్ భద్రాక్షసరుల్ భాసిలుచుండా ।వె।
4. కరమున దండముగల్గి త్రిశూలముకడిమి చెలంగగ గాంభీర్యముచే ।వె।
5. జపమాలిక కాషాయచేలమును, చపలత వ్యాఘ్రాజినము చెలంగా ।వె।
6. వారక శ్రీ ... గిరిగూహల్లోని నగడ వీరన స్వామిని తలంచి వెడలెవచ్చెను॥

హాస్యపు సంభాషణములు

హాస్య। ఓహో! యెవరయా మీరు జడలూ రుద్రాక్షలూ ధరించి జగన్మోహనంగా విచ్చేసినారు.

యోగి। ఆహాహా। మేము శ్రీమద్ ... పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారి సన్నిధియందుండె సేవకులము.

హాస్య। అయితే, మీ నామధేయం యేమయ్యా స్వామి.

యోగి। మా నామధేయం యేకాంబరయోగి అంటారు, వింటారు.

హాస్య। అయితే, గియితే ఏమి కార్యమున ఇచ్చటికి విచ్చేసినారయ్యా స్వామి

యోగి। మాయొక్క ప్రభువుగారైన శ్రీ శ్రీ స్వాములవారు వస్తూ వున్నారు గనుక యీ సభాసదులకు తెలియపరచ వచ్చినారము

హాస్య। ఓహోహో! ఆలాగునా? అయినప్పటికిన్నీ కానప్పటికిన్నీ వున్నది వున్నట్లుగానూ లేనిది లేనట్లుగానూ క్రమంగా తప్పకుండా చెప్పాకు రావయ్యా స్వామీ

యోగి। ఆహాహా! అట్లాగే వినండయ్యా అందరు మహాజనులూ

ద్విపద - ముఖారిరాగం

ద్వి। భువిలోన పేర్గల పురమై రంబరగి నవమహోన్నతమైన నందికొండ యను - క్షేత్రంబు పాపఘ్నసిద్ధిప్రదంబు - స్తోత్రపాత్రంబట్టి శుద్ధ స్థలమున - యాజకుండగుచు వీరాంకుడై యొప్పు - భోజయాచార్యుండు పుణ్యప్రవర్తుండు - విశ్వకర్మస్వామి విఖ్యాతమూర్తి - యైశ్వర్యవంతుడై యతి తపధ్యాన-సంపన్ను-యాధుర్య చాతుర్యదక్షు-

పెంపొంది సుజ్ఞానపృథివి చేమించి - అప్పనిగారు వీరప్పయగాంచె-
చెప్పిచూపగరాని చిత్ర-శౌస్ఫూర్తి - చెన్నొంది మహిత ప్రసిద్ధుడో
యనగ-పన్నుగా బనగానిపల్లెను జేరి - అన్నాజిరావున కాత్మైక
బోధ - మున్నుగా దెల్పి సంపూర్ణంబుగాగ - మరియు కాలజ్ఞాన
మహిమలు దెల్పి - ధరణి మా యాజ్ఞను తలదాల్పు మంచు - శ్రీ
విరాట్ పోతులూర్వీరాంశు డగుచు-గోవిందమాంబను గూడి తేజ
మున - తాను బ్రహ్మంబైన తత్వంబు దెలిపి - మానుగానల కంది
మల్లయపల్లె - మఠమందు నివసించు మాన్యతజెంది - హఠయోగ
నిరపనాభ్యాససాధనల - జ్ఞానోపదేశంబు గణ్యతినొసగ - పూనిక
శిష్యులు పూజింపుచుండ-భజన కీర్తనలతో భక్తివైవార - నిజభక్త
గణములు నృత్యముల్ సేయ సాంగత్యపరులెల్ల శరణని వేడ-మంగళ
ప్రదములౌ మాటలాడుచును వేంచేసె బ్రహ్మంబు వీధులవెంట-సం
చితంబులు బాపు సద్గురుమూర్తి-ఆతని సద్బోధలాలించి మించి-ప్రీతి
గాంచుడయ్య ప్రియమిత్రులారా !

తే|గీ| మహితములకెల్ల విఖ్యాతమై వెలంగు
కందిమల్లయ పాలెంబు ఘనతరంబు
పుణ్యతర మహాక్షేత్రమై భూజనులకు
పాపనాశినియై కనుపట్టు మిగుల

పురమఠాభి వర్ణనము

ద్వి| ధరణిదేవికి ముఖదర్పణంబనగ-సుర మునీశ్వరులకు చోద్యంబుగాగ
తాపసోత్తములకుతారకంబనగ-దీపించు సుజ్ఞానదీప్తియనంగ-పామరు
లకు బుణ్యపాపముల్ దెల్పు - కామిత ఫలకంబుగా నొప్పు మహిమ
ధరణి భక్తుల కల్పతరు విదియనగ - పరికింప కైలాస పట్టణంబనగ
గోపురప్రాకారకుడ్యజాలములు - వాపీ తటాక సద్వనకూపములను
సకల లతావృక్ష సహితమైయొప్పి-యకలంక మహిమ జెన్నలరుచు
నొందు-ప్రకట సింహద్వారభవ్యైకవాట - సకలాతిశయ నిజస్థానసుంది
రమ్ము - సౌధాంతరంబున స్వామి వాసంబు - బోధనా రుచులందు
బొల్చారుచుండు.

కీర్తన యమునాకల్యాణి - ఆట

వచ్చెనిదిగో-బ్రహ్మము వచ్చెనిదిగో-సద్గురుమూర్తి వచ్చెనిదిగో
పల్లవి। వచ్చెనిదిగో భక్తజనులకు మచ్చికలర మహానుభావుడు
సచ్చిదానంద స్వరూపము సర్వజనులకు జూపనిప్పుడు॥వచ్చె।

1. మండలత్రయనేత్రుడై మార్తాండు డుద్భవమైనరీతిని గుండెలదరగ
రిపులపైబడు-కొండయని భీతాహమొందగ । వచ్చెనిదుగో

2. నందివాహానుడయిన పరశివు డందరిని రక్షించుకోలక్కై నంది దుర్గ
మూలోని ప్రమధుల - నందరిని వెనువెంటదీసుక । వచ్చెనిదుగో ।

3. ఆదిబ్రహ్మకుంలాబుధికి గమ. లారి యుదయంబైన సామ్యము ఆది
మూలంబగుచు భక్తుల నాదరింపదలంచి యిప్పుడు ।వచ్చెనిదుగో॥

4. ఆదియంతర్బాహ్యములకున. నాదియై తా నిజసమాధి వినోద
వైఖరి మీర భరితాహ్లాదచిత్తముతోడ, వేడుక ।వచ్చె।

5. కారణాతీత ప్రబోధ విచార పోతులూరి వీర ధీరగురుడు సమస్త
సుజనోద్ధారుడయి కడు వేడ్క మీరగ। వచ్చెనిదుగో ।

ఆ। వె। బ్రహ్మవచ్చెననుచు భక్తితో పురజరుల్
చూడవచ్చిరపుడు చోద్యముగను
వందనంబు లిచ్చు వారల దిలకించి
బ్రహ్మ మిట్లు వేడ్క - పల్కసాగె

దర్వు నాదనామక్రియ - ఆట

నేనే బ్రహ్మమురా ! పామరులారా ! నేనెబ్రహ్మమురా
పల్లవి। నేనేబ్రహ్మమువినుడీ! కామాదిగుణముల
నామరూపక్రియల - నష్టము పరచిన । నేనె బ్రహ్మమురా

1. ముద్రిల భావము - మూలము దెలిసియు
చిద్రూపమైవెల్గు - చిన్మయు గనుగొన్న - నేనెబ్రహ్మమురా

2. అష్టయోగాభ్యాస - మాది సాధనలను
నిష్టాచే పెంపొందు - నిజరూపు గనుగొన్న । నేనె బ్రహ్మమురా!

3. నడినాళమున వెల్గు - నాదస్వరూపుని
ముదమున గనుగొని-ముక్తిమార్గముగన్న। నేనేబ్రహ్మము

4. పంచవింశతి తత్వభావములను గాంచి
మించి వాయువు - కుంభించి రేచకమందు । నేనెబ్రహ్మ
5. సాంఖ్యతారకముల సాధించి యమనస్క-
భావముగనుగొని పరిపూర్ణమైయున్న - నేనెబ్రహ్మమురా।
6. క్షరమునుగాక యక్షరచిత్కళాతీత
భరమైన మోక్షసామ్రాజ్య సంపదనొందు నేనెబ్రహ్మమురా।
7. వాదభేదముల నివర్తించి కల్మష
భేదముగావించి - మోదమునొందిన - నేనెబ్రహ్మమురా।
8. ధీరత శ్రీ పోతులూరి వంశజుడనై
వీరబ్రహ్మముపేర - విఖ్యాతినొందిన । నేనెబ్రహ్మమురా
9. విరివిగ కడియాల వీపూరియాచార్య
వరుడమించియిద్ధరలోన వెలసిన । నేనెబ్రహ్మమురా రా

చ॥ పరమపవిత్రమూర్తియగు బ్రహ్మము తానని పల్క హర్షరస
భరితమనస్కులైరి, ఘన భక్తసమూహములెల్ల; ప్రేమచే
కరములు మోడ్చి మ్రొక్కుచును గౌరవమొప్ప ననేక భంగులన్
స్మరణమొనర్చి రప్పుడలసద్గురుమూర్తియు పల్కెనిట్లుగన్

కాలజ్ఞాన తత్వము

1. వినరయ్యా జనులార ! మీరు భక్తివినయముగల్గిన వెలయనేర్చెదరా
వెనుకముందు జూడగలరు । కొన్ని - విపరీతములు గలుగు, వినక
పొయ్యేరూ ।విన।
2. మరి యింద్రకీల భూధరము । అదియే, మహిత దేవ మునుల -
సురుగు సుస్థిరమూ భరిత నాగేంద్ర భీకరము । అచట, బహు
ఘోరకదనమూ ప్రజకు నాశనమూ ।విన।
3. భాగీరథి తీరముననూ గొల్లపల్లెకడుగొప్ప పట్టణమగుననూ భోగా
తిశయము వాటిలును వాయువేగ,మనోవేగములు సిద్ధమగునూ।విన।
4. దుర్గుణములు విస్తరిలును।కనక దుర్గ మదికి వింతదోచి రంజిలును।
భర్గుని సెలవు గైకొనును । అట్టె. దుర్గ కృష్ణవేణితో చెల్మిగనునూ
వచ్చురయ్యా।

5. ఒక్క నిమేషమాత్రమున దుర్గ, ముక్కపోగు కృష్ణముక్కున బడిన ఎక్కడెక్కడ శక్తులయిన। కడు మిక్కవగొను జనుల మరణ కాలమున ॥విన॥

ధరణిపతులు తారసిలిన । రక్తధార ప్రవాహమై దగ భీతినిడిన నర మూక తల్లక్రిందయిన। శక్తి, నవ్వుచు భక్షించు నానావిధములు॥విన॥

7. కోట్లసంఖ్య జనులుగూల॥ మూడు పుట్ల నల్లులయొక్క గడియలో రాల పోట్లాడే శక్తులు జనుల బాగా మాట్లాడి జనముల నల్లాడు చాలా ॥విన॥

8. నన్ను నమ్మని దుష్టజనులు। ఘోర, నరకకూపాంధమునందుగూలె దరు పన్నుగ సద్భక్తి పరులు । మెట్టి, బాధనందక మోక్షపదవి గాంచెదరూ ॥విన॥

9. పరిటేల గ్రామమందునను। వెదకి పట్టితెచ్చిన రవ్వ భద్రపీఠికను స్థిర సింహాసనమై రంజిలునుఅల్ల,ధరణిపాలనజేతు తథ్యమెంచగను॥విన॥

10. తప్పక వినుడు నామాట-రక్తి నొప్పనార్యులకెల్ల వరహాలమూట మెప్పుల కిది పూలతోట - సుంత, తప్ప నేరదు నుండి తగు ముక్తిబాట ॥విన॥

11. భక్తులు గొనియాడగాను - వీరబ్రహ్మనామముచేతప్రభవించినాను భక్తజనుల బ్రోవగాను - భక్తి, ముక్తు లొసంగు సత్ ప్రభుడనౌ నేను ॥విన॥

ఆ॥ వె॥ ఇట్లు పల్కయున్న ఈశ్వర తుల్యుడౌ వీరగురునిమహిమ విస్తరిల్ల మగువలెల్ల గూడి-మంగళారతులిచ్చి పాడదొడగిరపుడు బ్రహ్మమునకు

మంగళహారతి - నాటకురంజి - జుల్మ

1. హారతివ్వరె శ్రీపోతులూరి వీరబ్రహ్మమునకు హారతి । సారెసారెకు మీరు పరి, నారముతో, గారముతో, భారముతో,ధీరముతో॥హా॥

2. మానసంబనెడిపళ్ళెరమూని హాంకార కర్పూరమూన సూటిజ్యోతి స్వాధీనముతో జ్ఞానముతో ధ్యానముతో, గానముతో ॥హా॥

3. అండపిండాండ బ్రహ్మాండమును నిండియుండి, దండిగాను వె ఖండితునకు మండితునకు పండితునకు దండములిడి ॥హా॥

4. సారసాక్షులారా, ఆరు సారసములమీఱర, సహస్రసార, మేరు శిఖర, మాధారముగ, పూరముగా, సారముగా హారముగా ॥హార॥

5. జోడు నాడుల నడుమ నల్లాడుచుండిన నీరభద్రుని కూడి వేడుక నొందుచుండి ఆడగను, పాడగను వేడగను చూడగను ॥హా॥

6. బిందునాద కళల కవ్వల జెంది నిర్వికారుడయిన కందిమల్లయపల్లె వాసున కందముగా చందముగా నందముగా వందనమని ॥హా॥

7. శంకలెల్ల విడిచి కొండ శంకరాహ్వయ కవిని బ్రోచిన పంకజోదరు నకు, నామాంకముగా, వీరాంకముగా, పొంకముగా, బింకముగా ॥హారతివ్వరే।

కం. సకల జనంబులు భక్తులు నకలంకితులైన శిష్యులాసమయము నం దకుటిల భక్తిని మ్రొక్కుచు ప్రకటనగా నతులొనర్చి, పల్కిరి వేడ్కన్

తే.గీ॥ సూర్యసింహాసనమున గూర్చుండు డనుచు
నిటల తటకర పుటులునై నియమభక్తి
నలరి మనములు బ్రహ్మమం దైక్య పఱచి
చరణ కమలములకును సాష్టాంగ మిడిరి

అర్ధకందం॥ ధారుణి మము రక్షింపగ
మీరీవిధి నవతరించి మించిన కృపచే
గారణ కార్యాతీత వి
చారణ సంతత విలాసా! భాసురా జ్ఞానానంద హాసుధా
కోరిన కోర్కెలు దీరె మిమ్ము నిం
పారగ గంటిమి ఛరితవిలాస! భాసురా! ।జ్ఞా।

2 అ. కం॥ పరమవిలాస శుభాకర
నిరుపమ హంసస్వరూప నిర్మలదీపా
పరశివ మార్గకలాపా
కరుణానిధి మిమ్ముజూడ! గంటిమిమీ! మీకీర్తి సల వింటిమీ
నరులము కడు పామరులము గావున
చరణాంబుజముల సేవారతిచే గంటిమీ మీ ॥క।

వ. అంత సంతసంబున భ్రాంతిరహితుఁడై, గురుమాత్రచింత నానంత శరణుఁడైనవారల, నత్యంత దయారస స్వాంతుండయి శ్రీవిరాట్ పోతులూరి వీరనారాయణ పరబ్రహ్మంబు "చిత్తశుద్ధిర్భవతు" అని యాశీర్వదించి కూరుచుండెను.

సిద్ధుని వృత్తాంతము - తెరలో ద్విపద

ద్విపద॥ శ్రీసద్గురు ధ్యానచిత్తుఁడై యాత్మ-భాసిల్లుచుండెడి భవ్యశీలుండు ముడుమాల పట్టణమున నివసించి-యెడపకుండు దూదేకుల కులజుడగు సిద్ధులోక-నాథాత్మలో స్వీయ-గురు పూర్వజన్మవృత్తాంతంబు తానె - కనుగొని తలపోసి కాయంబు రోసి మునుసద్గురుని దయామూలంబుచేసి-బూటకంబౌ పంచభూత జాలముల - నాటకుండగు వీరనారాయణుండు-నా పూర్వగురుడను న్యాయంబు దెలసి-ప్రాపు నీవనినమ్మి పాపముల్ జిమ్మి మార్గణంబులడంచి దురితముల్ ద్రుంచి సద్గత స్థిరతను సమమంబు పూని - దశ విఘ్నేంద్రియరాశి దహనంబు జేయ వశ పడియెను భూతవర్గంబులెల్ల - అప్పుడు సిద్ధాఖ్యుడానందమంది - తప్పక సద్గురు దర్శింపదలచి___

సిద్ధుని దరువు - నాథనామక్రియ రాగం

రావేపోదాము, మానసహంస, రావేపోదాము, సద్గురుజూడ॥రావే

1. రావే పోదాము యీ రవ్వ లింకేలనే, భావములో నగుబాటు నీ కయ్యేనూ ।రావే।
2. అండ పిండాండ బ్రహ్మాండము లందున । నిండియున్నట్టి యఖండ తేజుని జూడ ।రావే।
3. ఎడమ కుడులనున్న యిడ పింగళములచే । నడి నాళమున వెల్గు నాగ కన్యను జూడ ।రావే।
4. చక్షుల నడుమను పశ్చిము వీధిని నిక్షేపముగ వెల్గు సాక్షి భూతుని జూడ ।రావే।
5. లోపల వెలపల ప్రాపుగా నిలచియు - వ్యాపకమై యున్న ఆపో జ్యోతిని జూడ ॥రావే॥

6. పరిపూర్ణ నిర్గుణ భావము తానయ్యు-పరమాత్ముడౌ వీరబ్రహ్మము గననేడు ॥రా వే॥

7. విరివిగ కడియాల వీర్పూరియాచార్య-వరదుడై వెల్గు సద్గురుమూర్తి దర్శింప ॥రా వే॥

కం. వీరబ్రహ్మము చెంతను చేరి సదానంద పదవి చెందుట కొఱకై కోరికపడి యా సిద్ధుడు చాలఁత గురుమూర్తి నిట్లు తలదివం గడగెన్.

స్తోత్రము - పంచచామర వృత్తాలు

1. ధరామరాసురాపరాది దైవతత్వ దీపకం
చరాచర ప్రభూత భూత సైన్యదైన్య మాపకం
నిరామయా ప్రమేయచర్య నిష్కళంక రూపకం
విరాట్ స్వరూప పోతులూరి వీరదేశికం భజే॥

2. పరాత్పరం నిరీశ్వరం సుపర్వ సర్వవందితం
దురాక్రమారి భంజనం సముజ్జ్వలాభి రంజనం
ధరాధరాభిధీర భూరిధైర్య కార్య కారణం
విరాట్ స్వరూప పోతులూరి వీరదేశికం భజే॥

3. ధరాంబు వహ్ని మారుతా ప్రభతత్వ సత్య తారకం
పురాంతకాత్మ భూద్మరారి భూరిధీరరూపకం
నిరూపదీప కాత్మరూప నిష్కళంక భాసితం
విరాట్ స్వరూప పోతులూరి వీరదేశికం భజే॥

4. పరాక్షరం నిరీక్షరం శుభప్రభాభి లక్షణం
నిరీక్షణత్కటాక్ష వీక్షణేక్షణం విచక్షణం
సురక్షితాంతరంగ భాగ్యశుద్ధభక్త సాక్షిణం
విరాట్ స్వరూప పోతులూరి వీరదేశికం భజే॥

5. ఖరాసురాదిమారణం సుఖప్రదాభికారణం
నిరాశ్రయావనప్రకాశ నిశ్చితాశయాత్మకం
స్థిరాస్థిర ప్రభావివేక చింతనావిమర్శకం
విరాట్ స్వరూప పోతులూరి వీర దేశికం భజే॥

వ. అని యిట్లు స్తోత్రంబులుచేసి స్వాంతంబున శాంతంబు వహించి, విభూతి రుద్రాక్షమాలికాధరుండై యున్న సిద్ధునింజూచి యాశ్చర్య మంది తల్లియైన ఆదంబి యిట్లని చెప్పందొడంగె.

తల్లికొడుకుల సంవాదం : దర్బా - ముఖారి - ఆది

తల్లి॥ వలదురాసిద్ధా ! వదలరా యీ భక్తి. కలిగియున్న మహిమ్మ దీయులగానకను చెడిపోకుధా ! వల

కొడు॥ తల్లీ ! నీవీలాగు తహతహపడనేల ? తల్లిపిల్లలు మాయయను చును ధరణిపెద్దలుచెప్పరా ! తల్లి నీవీలాగు

తల్లి॥ మతముతప్పి వేరెమతము బట్టగనేల ? మతములందు ఖురాను కంటె మంచిదెచ్చటగల్గురా ? వలదురా

కొడు॥ మతమానిచెప్పేటి మాటనీకేలనే ? మతము గల్గినవారు తమ చెడుగతులుగానరు తెలియవే తల్లీ !

తల్లి॥ ఎందులకీ భ్రమకెందెదవురా పుత్ర ! అందరిట్లుల తల్లికిని యెదు రాడ నేర్తురె కంటివా ? వలదురా

కొడు॥ ఎందరెన్నిటిజెప్ప, నేమి సద్గురు దయ చెందనేరని మానవులతో మందలింపగనేలనే ! తల్లీ ! నీవీలాగు

తల్లి॥ హాటము జేసెదవేర-అకటా నీకీబుద్ధి పటుతరంబుగ నెవరునేర్పిరి? బాలుడవు నీకేలరా ! వలదురా

కొడు॥ బాలవృద్ధులనేటిపలుకులు నీకేల చాలగా యీ మనుజులందరు చచ్చిపుట్టుట కానవా ? తల్లి

తల్లి॥ తల్లిదండ్రులయాజ్ఞ దప్పుట ధర్మమా? యిల్లువాకిలి విడిచి నీవిటు వెళ్ళిపోవగనేలరా ! వలదురా

కొడు॥ తల్లిదండ్రుల మాయ తగ బంధుజనులింట్లు వెళ్ళిపోయేనాడు- యెవ్వనివెంట వత్తురు కానవే ! తల్లి నీలా

తల్లి॥ ఎన్నినేరిచినావు చిన్నవాడవు నీవు కన్నతల్లియటంచు కొంచెము కనికరములేదాయెనా ! వల

కొడు॥ చిన్న పెద్ద యనుచు చెప్పగనేటికె చిన్న సింగపుపిల్ల యేనుగు గున్నలను వధియించదే ! తల్లి

తల్లి॥ ఎవ్వరీలాగున హితవుజెప్పిరి నీకు నవ్వుటాటలుగావు నినుబోనివ్వ
నింతట నిల్వరా ! వలదురా

కొడు॥ దారి కడ్డంబేల దగిలెద వీరీతి. కోరి వీపూర్వాఖ్య కవినుత హీర
సద్గురుగాన వే ! తల్లి నీవిలా

చ. వినగదె తల్లి నామనవి విశ్వమయుండగు వీరసద్గురుం
డనగ మహాత్మ డాయన పదాబ్జములన్ హృదయాంత రాళమం
దునిలిపి గొల్వ గల్మషవిదూరములై మమజన్మకర్మముల్
కనలి దహించు. సంతత వికాసము మోక్షపదంబు జూపెదున్

తల్లికొడుకుల సంవాదము, ముఖారి - ఆటతాళము

తల్లి॥ ఏమిరా! సిద్ధా, చెప్పిన విన వేమి సుబుద్ధా
మోమాటముంచి, నా మోము చూడవి దేమి
ధీమానసమా, నాపై, తామానసమాయింత ।యేమిరా।

కొడుకు॥ వినుమమ్మా జననీ, నీ మాటలు వినమదిబూని
వినయముతోడ నేవని చెప్పినన్ గాని
వినుటసద్ధర్మము వివరింపగానేల వినుమమ్మా

తల్లి॥ ఏలర కొడుక ! నా మాటవిన కేలరదుడుక
గోలాపన్నెండేండ్ల బాలుడవై నీవు
చాల నజ్ఞానమాలీల బ్రేలెదవేల ।యేలర।

కొడుకు॥ తడవేలనమ్మా యీ పనికెట్టి గడువేల నమ్మా
పుడమిజీవులకెల్ల పుట్టుట గిట్టుట
యెడ తెగకుండుట, యెరుగవే గుమజేర । తడవేలనమ్మా

తల్లి॥ చిన్నతనమున యిట్టి జ్ఞానమెన్న మనమున
కన్నకొడుక నీకే ఘనులు బోధించిరో
నన్ను వీడుట నీకున్యాయమటర తండ్రి ।యేమిరా।

కొడుకు॥ చిన్నతనమున పెత్తనమైన చెడిపోదుగాన
చిన్నా పెద్దతనాలు జీవునకును లేవు
పన్నుగా నిది మట్టిపాలై పోవునుగాన ॥విను॥

తల్లి॥ కులమతము వదలి, మతమును జేరదలచియు గదలి
పలుతనంబున పరుగులెత్తగ నీవు
వలచిన యజ్ఞాన వాంఛవీడుము యింక ॥యేమి॥

కొ॥ కులము మతములు కలిమాయచే గలిగె భేదములు
కులము బిందు రక్తములు రెంటిచే నాయె
తెలియని హీనులు తెలుపు మార్గముగాని ॥విను॥

త॥ ఏరకుమార! బంధువు లెన్న దూరము వార
ధీరుడా పోతులూరి వీరబ్రహ్మ
మీరీతి నుపదేశ మాయాఢి జేసెనా ? "యేమిరాసిద్ధా"

కొ॥ ఖండితముగను యీగతి బల్కగాదమ్మ జనని
కొండ శంకరకవి కూర్మి నారాధించు
దండి పోతులూరి దైవము నెఱుగవు ॥విను॥

ఆదంబి కంఠార్థము కొడుకా విన విది యేలర
దుడుకు పనుల్ సేయ నీకు దోసంబగురా
అడియాస, లేల జెంబెదు
విడువుమురా జ్ఞానగురునీ వీరబ్రహ్మమునూ
నామాటలు వినియు బ్రహ్మమునూ
కడుపున బుట్టిన కారణమున నిన్ను
విడువజాలక నిల్లు వెతలంగుందగ వలసె, వీరబ్రహ్మమునూ
నామాటలు వినియు బ్రహ్మమునూ

సిద్ధుని కంఠార్థము:- జననీ విడువను జ్ఞానము
మనమున నీ సందియంబు మానుము వేగన్
జనుమా లోనికి నిప్పుడు
పనిగొని యావీరగురుని పాదముల విడనే
ఆలోచింప బనిలేదు విడనే
మునుకొని సుజ్ఞానమునగాని నరునకు
జననాది గుణము సాధనచే నశింపగా । పాదము విడనే

ఆదంబి సిద్ధుల సంవాదం - ముఖారిరాగం కీర్తన

ఆదంబి॥ కానిపని యిది పూనకూడదు
సగానుడవు నామాట వివవిది యేలరా । యీ చలమేలరా।

సిద్ధు॥ కల్ల సంసారంబు నిజమని
గట్టిగా నామనసుకెంతయు నాటదే, చెప్పేమాటదే

ఆదం॥ తల్లిదండ్రుల మాట మీరుట
తగదురా యీ లోకులెల్లను-నగుదురూ వినకచెదుదురూ

సిద్ధు॥ తల్లిదండ్రు లనంగ నెందరో
ధరణి జీవుల కెల్ల జన్మము లెరుగవే, సత్యము నెరుగవే

ఆదం॥ చిన్ని బాలుడ వౌర మాటలు
ఎన్ని నేర్చితి వింక జెప్పగజాలనూ, వాద మేలనూ

సిద్ధు॥ ఎన్ని చెప్పిన సద్గురుని దయ
కన్న మిక్కిలి లేదు జగము లబద్ధమూ, బ్రతుకే వ్యర్థమూ

ఆదం॥ తనయ నీకీ బుద్ధిపోచుట
దైవచిత్రముగాన నిన్నేమందురా, యే విధి నుందురా

సిద్ధ॥ దైవచిత్రమటంచెటిగి నా
దారికష్టము వచ్చుటను మూనవే. కనికరమూనవే.

ఆదం॥ మేరగాదుర పోతులూరి
వీరసద్గురు సేవ యిక చాలించరా, నన్ను మన్నించరా

సిద్ధ॥ అరుదుగా కడియాల విప్రా
ర్యాఖ్యకవి రక్షకుని విడువజాలనే । మాట లేలనే

వ. యిటుల కటినతనంబున మాటలాడు కొడుకుంగని పోగుసేయు పీరు
సాహెబు అనే పేరుగల తండ్రి సిద్ధునితో నిట్లనియె—

తండ్రి కొడుకుల సంవాదము ముఖారిరాగం-ఏక

తండ్రి॥ వద్దురా ! సిద్ధా ! వద్దురా యీఙ్ఞానమూ
హద్దుపద్దు దిద్దలేని మొద్దుతన మది సద్దరా ।వద్దురా।

కొ॥ విడువజాల తండ్రి వీరబ్రహ్మ గురుని
అడరి గురుతిరువడి ఘళిర ఘడియడము నడువడి విడువనూ

తం॥ పాటము జేసెదావు కటుకు తెనము విడరా
చటులమగు మన కుటిల కులమిటు పటుతరంబగు మతమురా॥
కొ॥ యెందుకింత నిందనంచుట జనకా
బిందునాద కళంచు జెందితి మందమతి నాయందు లేదు॥
తం॥ మాయమాటలు సేయ న్యాయమురా కుజ్జా
దాయత యీ సాయిబాబు లపాయములా గోయరా॥
కొ॥ వాదమేల గురుని పాదము విడనూ
వాదభేదములేని వేదము నాది పాదిది మోదమూ॥
తం॥ సతతము మనమతమిది గాదు
వెతలు లేని మహామ్మదు మతస్థుడ వతిజితగతుడవూ॥
కొ॥ మతముల గతులు నా కతిపతితములు
యతులు హితులు సుమతులు అతులిత వితతులకు సమ్మతమిది
తం॥ ధీరులౌ పీరుజాల్ వారలున్నారు
తీరు మారుగకోరితే సరివారులేర, శూరలూ
కొ॥ ఆరుషోరు నేరమూర మాబాబూ
మరుతారకమైన పోతులూరి వీర బ్రహ్మపాదము ॥విడు॥

ఆనంబీ పీరుసాహెబుల అంగీకారము – ద్విపద

ద్వి॥ శ్రీవిరాట్పోతులూర్వీర సద్గురిని-సేవనాసక్తుడై సిద్ధుడుండగను జననీ జనకులెంత చక్క-జెప్పినను-వినకున్న వారలు విస్మయులగుచు-సిద్ధుని దగ్గర జేరంగబిలచి-బుద్ధిమాటలు చెప్పి పొలుపొందగాను – శ్రీగురు పాదరాజీవముల్ గొలిచి-బాగుగా జ్ఞానంబు బడయుమటంచు-కొమరుని దీవించి కోర్కెలుమించి-తమ సమ్మతిని చెల్పి తగబంపి రంత॥
కం. వీరబ్రహ్మము చెంతకు జేరెసదానందు డగుచు సిద్ధుడు వేడ్కన్ మీరు నను బ్రోవుడని పద సారసముల కెరగి యిట్లు సన్నుతి జేసెన్.

సిద్ధప్ప స్తోత్రము – చూర్ణిక

శ్రీమదఖండమండితసచరాచర బ్రహ్మాండ భాండోదర సహస్ర కిరణా వరణమార్తాండ మండలార్చిత చరణరాజీవయుగళం బ్రహ్మవిష్ణు శివాఖ్య ప్రభాభాసమానాంచిత ప్రతాప దీపం! చందనాగరు కస్తూరి

ధూపవాసిత బంధురనిజానంద తుందిలవిభ్రమ భ్రమమాలంకారహృదయ కలాపం। జగన్మోహనస్వరూపం। నటనస్ఫుట పటుపటాత్కార భావోత్కట నిటలతటఘటిత త్రిపుండ్ర రేఖావతంసం। జటాంటలపటుతర కోటిసూర్యభాసముత్కట దిక్తట సముద్భాతాట్టహాసభాసురం - హఠయోగాభ్యాస కౌశలితానంత కోటిభటసముజ్వల సుఘోషం - శాంత శమదమానంత కళ్యాణగుణవిశేష విభ్రాజమాన మహామంత్ర యంత్ర తంత్ర భయనివారణోచ్చారణ కార్యకారణా ధ్యక్షరక్షా చరణ దీక్షం- రక్షణావిచక్షణ సాక్షాత్పర దీక్షార్ద్రకటాక్షే క్షణలక్షిత మోక్షాస్పద సూక్ష్మం -భక్తజన కటాక్షం- యమనియమాసన ప్రాణాయామప్రత్యాహార ధ్యానధారణ సమాధిప్రముఖాష్టాంగయోగనిరతాభ్యాస భాసమానం- నిష్టాగరిష్ఠ సృష్టిస్థితిసంహార తిరోధానానుగ్రహక్రియా సమగ్ర నిగమాగ ప్రమచార సారలక్ష్యార్థగోచరవిరాజం - శ్రీమన్మహా మండితోద్దీపిత కనక మణిఖచితగోపుర ప్రాకారసౌధాంతర కందిమల్లయ పురవిహార పరమ హంసాయమాన విశ్వేశ్వరాంశా ప్రకాశిత బ్రహ్మస్వరూపం - శ్రీమద్విశ్వకర్మవంశ పయఃపారావార రాకాసుధాకర కడియాల మల్లయార్య తనూభవ వీపూర్వాచార్యసమర్చితదివ్యపాదాబ్జంజ యుగళం - త్వాం భజామి గురువే పాహిమాం పాహిమాం పాహిమాం

వ॥ స్తోత్రపాత్ర గురూక్తసూత్రానుబద్ధ షడ్వర్గ నిరుద్ధబుద్ధుడగు దూదేకుల సిద్ధుండు చరణద్వంద్వాను సంబంధ బంధురుండౌట యెరింగి వత్సలత్వమున నతని గటాక్షించిహస్తమస్తక సంయోగంబుజేసి శ్రీవిరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారు లేవనెత్తి "చిత్తశుద్ధిర్భవతు" అని యాశీర్వదించి యిట్లనియె

కం॥ వర్ధిల్లుమోయి సిద్ధా వర్ధిల్లుము చిత్తశుద్ధి వరల ప్రసిద్ధా
వర్ధిల్లు జ్ఞానబుద్ధా వర్ధిల్లుము నిరుపమాన భక్తిశ్రద్ధా

వ॥ అంత సిద్ధుండు జ్ఞానాసక్తప్రబుద్ధుండై శ్రద్ధాభక్తి పూర్వకంబుగా శ్రీ విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి చరణాంబుజంబులకు సాష్టాంగ దండప్రణామంబులాచరించి, లేచి- నిలచి పరశివయోగం బుపదేశింపుమని వేడుకొనుచుండు సమయంబున

చారుని వాక్యములు

చా॥ ఓరీ ! నీకులమేమో, నీ స్థలమేమో, నీవూరి పేరేమో, నీపేరే
మో, నీ తలిదండ్రు లెవరో, టక్కుమాటలతో నిక్కనిక్కం
బుగా, పెక్కుమాట లాడక చక్కగా దెలుపరా ఓరి !

సి॥ అలాగే దెలుపుదునయ్యా స్వామి.

సీసారం । మాయూరు ముడుమాల మా తండ్రి
పీరుసాహెబు తల్లి ఆదంబి హెచ్చుగాను
యేకులు జేయు దూదేకులమని
లోకు లాడుదురు చీకాకుగాను
వారికి గొమరుండ, వసుధలో నా పేరు
సిద్ధుడని వచింతురయా, సిద్ధముగా స
బద్ధము లేదని యెంతురయా
వద్దికతో నా మొద్దుతనము విడ దిద్దెడి ప్రభువుల యొద్ద జేరితిని
సద్దయతోడుత బుద్ధిజెప్పి నను హద్దుతప్ప నిదితద్దయు సత్యము। సిద్ధుడని

బ్రహ్మంగారు - సీసపద్యము

సకలజనంబులు చనువుగ మీ తల్లి దండ్రులు పిన్న పెద్దలును ప్రియులు
అందరు వినజెప్ప నెందుకు నీ రీతి విచ్చేసినాడవు వెఱ్ఱిగాను
పరవస్తువు నెఱుంగ బ్రహ్మాది సురలకు
తరము గాదిక నీకు దరమె తెలియ
ఈ వెఱ్ఱి నీ కేల యిలదారసుత వాంఛ
గలిగి వర్తించుటే ఘనము సుమ్ము
యెంతమాత్రము కూడదు యిట్టిబోధ
బాధ నీ కేలరా యింటిపట్టు నుండ
దారి జూచుకు వెళ్ళుము తగవుమాని
యిట్టి యుపవాద మేలరా యిలను మాకు॥

బ్రహ్మంగారికి సిద్ధునికి సంవాదము - దరువు - ఆదితాళము

బ్రహ్మ। వదు వద్దు బుద్ధి వినవో యీ దూదేకుల సిద్ధా

పిద్ద వద్ద బుద్ధి వివర్వ హాష్ఠ తెలియు నెవరితరము
సుద్దులుగావు పద్దులునావు సూక్ష్మరూప మాగు సూటి దెలియ

సిద్ధ । వదలిపెట్ట నీదు పదములు శ్రీగురుబ్రహ్మం
వదలిపెట్టను నీదుపాద, పంకజమూ ౦ ముదము మీార
చదలుగాద్దు అగ్ని నీకు జగతి కాధారంబు దెలుపగ ।వదలి।

బ్ర । గగన సదృశంబైన యాత్మగనగ నెవరి తరముగాదు
ముగురుమూర్తుల కలవిగాక, మూలవిరాట్టుగడగడవడ కెను ।వస్తు।

సిద్ధ । మూడుమూర్తుల కలవిగాని మూలమేదో గురునిసూత్రము జాడ
దెల్పక నెన్ని చెప్పిన సర్వసాక్షిని తెన్నుగానక ।వదలి।

బ్ర । అందరాని మానిపండు అందితే ఫలమందిలేవు, ముందుయోచన
దెలియక నీవు మూలవిరాట్టు స్వరూప మయ్యేదే ।వస్తు।

సిద్ధ । అందరానిదయ్యు నందు యిందానాక నిండి
సందు దుల లోపలనుండే సర్వసాక్షిని దెలిపినగాని ।వదలి।

బ్ర । ఆడ మగవాడుగాక, జోడుగూడి యుండగాను
ఆడ దీడది యనుచు చూచే, ఆత్మలో పరమాత్మయానిది ।వస్తు।

సిద్ధ । ఆత్మనాత్మ భావమేదో, అంతటా త్రాణనమేదో
ఆత్మగాక తాను ప్రత్యగాత్మను మూలమును జూపక ।వదలి।

బ్ర । దండి మెండి మాటలాడి గుండెదిటవున నుండినావు
గండికనము దారిలో నీవండజేసుక నుండగలవా ।వస్తు।

సిద్ధ । పండువెన్నెల వోలెనంతట నిండియుండి దండిగా నఖండమైన
వస్తువుతనై, దండము మెండుగాపెట్టితి । వదలిపెట్ట

కందార్థము దేవా నీదుమహత్వముభావింపగ నెంతవాడ పామరుడను నన్
గావ తలిదండ్రులు లాప్తులు దేవర మీాకంటె వేరే దిక్కెవరయ్యా
నాకిక ముక్తి తెరువియ్యరయ్యా భూవలయమునందు పుట్టట చచ్చుట
భావింప నిట్టి దుర్భ్రమల జెందనీక । దిక్కెవరయ్యా ।

బ్రహ్మంగారు — సీసపద్యం వినకోరి చెప్పెద విశదంబుగా మూడు
గుణములనీ మస్త్యకోటిసేడు

షడ్గుణంబు లవియు సాధింపగా రాని పంచేంద్రియములచే పట్టువడును
త్రిగుణంబులవియును తెంపుసేయగ రానివంను నొక్కటిరాజు చెందేవీని
శుద్ధజడంబుగా బద్ధు జేయుచునందు మూలాహంకారంబు మమతగప్పు

గాన నీవిట్టి లీలలాయ గడువవశమె
యోగ మదియేడ, నీవేడ, సాగిపొమ్ము
తెలిసి గూడు నె యీ మహాతత్వ గాహితము
తెలియ నెవ్వరు సిద్ధుడా! తెలియుమోయి.

సిద్ధప్పకును బ్రహ్మంగారికి సంవాదము – ముఖారి – ఆట

సిద్ధ। గురువరేణ్య పదాబ్జములు హృత్సరసిజంబున మ్రొక్కినిల్పితి
బ్రోవుమూ, నన్ను గావుము

బ్ర। హరిహరాదుల కందగూడని పరమగుహ్యం బైనవాక్యము
చిక్కునా నీకు దక్కునా

సిద్ధ। భక్తవరద దయాకరా బహుభక్తుడను నన్నే విధంబున
గాతువో దయను జూతువో

బ్ర। తామసాదులు దుర్గుణములవి స్తోమమై బాధింపుచుండును
మానవు, వాటిని కావవు

సిద్ధ। పతితుడగు నను పావనునిగా – హితముగా నీ సుతునికై వడి
చూడవా కోపము వీడవా

బ్ర। మున్ను తాపసులెల్ల చిన్మయమూర్తిగానక ఘోరకానల
దిరిగిరీ – యెరుకా మరగిరీ

సిద్ధ। సూరిజనసుత పోతులూరి, వీరసమ్మునుడంచు చెంతకు
జేరితీ మోక్షము గోరితీ

బ్ర। తారతమ్యము జూడ కాత్మవిచార మర్మ మెరుంగజేతురు
వ్యర్థులూ వా రసమర్థులూ

సిద్ధ। ధారుణిన్ కడియాల శ్రీ విప్రారి సత్కవి రక్షకుడ విక
బ్రోవవా, నను దయ గానవా

కందార్థం।పరమాత్మ భవవినాశక సరసదయా పూర్ణచంద్ర సంతతసుగుణా
వరదాయక నను బ్రోవుము గురుడని నిన్నాత్మదలచి – కొంటినీ

భయముల దీర్పమంటెసీ-నిన్నీడుమవజాల నంటెనీ హరిసరసిజభవ,
సురనరవర సంస్మర చరణాయుగ సతతము నమ్మి యుంటెని.

బ్రహ్మంగారు - సీసార్థం

శ్రీ సచరాచర సృష్టికావలి వెల్లు అతిరహస్యాధార మైనవెల్లు
స్థూలసూక్ష్మవిభూతి శోభితంబగు వెల్లు అన్నిట బరిపూర్ణమైన వెల్లు
బ్రహ్మాండ గోళ సంభ్రమమూలమౌ వెల్లు బ్రహ్మాదులకెరుంగరాని వెల్లు
వేదవేదాంత శాస్త్రాదులెన్నని వెల్లు అఖిల లోకాధారమైన వెల్లు
గురుకృపచే గాక గురికి డాయని వెల్లు నీకెట్టులగుసాసాధ్యము ఎన్నగ
ప్రాజ్ఞ-లోకమునకె బోధ్యము మరి నీలతో యదమధ్య విద్యుల్లేఖ
మాడ్కి- ప్రకాశించు మరుగు వెన్నెలతేట నీకెట్టులకు సాధ్యము॥

సిద్ధుని ద్విపద - ముఖారి రాగం

ద్వి॥ వినవయ్య గురునాథ విన్నపంబొకటి-మును పరశివయోగమునకునై
మిమ్ము-నకలంకముగ మానసార్చనజేసి-యొక జన్మమెత్తితి యుర్వి
తద్ జ్ఞాన-మీజన్మమునగల్గె నీడేర్చుతండ్రి-నైజాశ్రయంబిచ్చి నా
గురునాథ-అష్టాంగయోగ సదభ్యాస నిరత నిష్టాగరిష్ట నిర్నిద్రదన్నీవ
ఘనతపస్స్వాధ్యాయకారణాతీత-అనుదినంబును నిన్ను నాత్మనేననుచు
పనిబడి గ్రహియించు భావంబు నాత్మ-జనియించుటాదిగా చరణాబ్జ
సేవ-గురు పరబ్రహ్మ నిన్ గోరుచున్నాడ పరతత్వసుజ్ఞాన పరమాత్మ
నిన్ను-వదలిపెట్టను సర్వవాంఛల విడచి-సదమల మతిని మీ చరణ
సేవాభి రతుడనై యున్నాడ ప్రాపునీవనుచు-గతినీవె మతినీవె కార
ణంబిచ్చి-ననుకృతార్థునిజేయ నాథుండవీవె-జననాదులంగు సంశయ
మేల తండ్రి కరుణాపయోనిధె కావు"మటంచు-శరణుజొచ్చిన మహా
శ్చర్యంబుతోడ - కరుణాంతరంగుడై కరమొప్ప ప్రేమ - కొరతలు
దీర సద్గురు డిట్టులనియె.

బ్రహ్మంగారు సిద్ధుడు సంవాదము - శుద్ధసావేరి. ఆట

ప్ర॥వినరోరి సిద్ధా నామాట నీవువినగోరితివె ముక్తిబాట తనువు,ధనము
మనస్సును సద్గురునిపాద వనజములకు నొప్పజెప్పి నిశ్చయబుద్ధి
నునిచి పూర్ణసమాధియోగము, గనుట సాధ్యముగాద నల్పము
వనజభవ రుద్రాదిసురలకు వశముగాక తపించుచుండిరి ॥విన॥

సిద్ధ। ఏరీతి వినుచున్నగాని, ఆజ్ఞమీరక నడచెద ప్రాణిగోరితి నీపాద
నారసములు నా హృత్సారసమున నిల్పి యారాధింపగ మోక్ష
ద్వార మాది రక్షింప దుఃఖ నివారణంబై జనన మరణ వి
కారరహితంబై సదా పరిపూరితంబై నిజము గన్పడ ॥ఏరీతి॥

బ్ర। కోరి వేడినను రాదోరి, అది కోరకుండిన పోదు మీరి ధారుణి
ఘోర సంసార వారధి దాట దారి తెలియక మున్న తాపసోత్తము
లెల్ల దారసుత ధనవాంఛచే బరితాపమున దపమెల్ల గోల్పడి
వారు గోరికలనంగ చోరబడి ఘోరనరకము లనుభవించిరి ।విన।

సిద్ధ। పదపడి నన్ను రక్షింప, మీదె భారము నన్ను శిక్షింప చెదరక
వదరక పదరక బెదరక కదలక మెదలక గన్పించు బయలేదో
అదియు నాకు నెరుంగజెప్పియు అంతరార్థంబైన బయలున
సదనమయిన మహాప్రభావము సత్సమాధిని జెందజేయుము ఏరీ॥

సీ॥ శ్రీగురుస్వామి నీ సేవ భీరుతుడను జడుడు పామరుడని సంశయింప
వలదు నాయెడ కృపావార్ధివై దరిజేర్పదగునయ్య మీయాజ్ఞదప్పనెపుడు
తలిదండ్రులన బాసి తగు బంధులను రోసి యన్యుల గోరక యనుదినంబు
గురుడె దైవంబని గుర్తిజేసికొని మోక్షసాధనమైన సేవ సల్పనుంటి
తడవుసేయక నన్నిక ధన్యుజేయు భారకర్తవు నా పాలి ప్రభుడ నీవు
పోతులూరి సువంశాబ్ధి పూర్ణచంద్ర వీరగురు రాయ సద్ధర్మ విభవగేయ.

బ్రాహ్మంగారు - ద్విపద

ద్వి విన రోరి సిద్ధ తద్విధమెల్ల దెలియు-అనుదిన భక్తిచే ననుకూలమైన
గురుశిష్య సంవాద కోరిచూడగను - పరమధర్మంబయిన పద్ధతుల్
నాల్గు - గలవు చెప్పెద నాన్నిక్రమమెల్ల వినుము తెలియంగదరము
సుధీరతమెరయ-తనువు నష్టంబును తలసిల్పి క్రమొక్కి- మనసు నిశ్చల
బుద్ధి మమతవాయంగ - మది నాది నేనను మాయను బాసి పదపడి
సుజ్ఞానపదము గ్రహింప - తగు ముక్తికాంతను తమిదీరగూడి నిగమ
వేద్యుండైన నిశ్చల చిత్తు-డగు నంతవరకు మహాత్మ్యంబునందు ఆది
గోప్యమదియు మహాత్ముల కైన-పవిత్రమై యెప్పను పరమగుహ్యంబు
శుకుడాది ఋషులకు శోధింపరాక సకల బాధల జెంది యుపయోగ

సకల-ముద్రల సాధించి మొదలెరుంగకను-నిద్ర మున్నయిన సన్నియము
విసర్జించి జపతపంబులను నిష్ఠాత్ముడై యోగ - నిపుణత్వమును లేక
నిజమాయలందు-చిక్కియుచిక్కక చిత్రశైఖరుల - మక్కువల్ విడ
లేక మమతలు పెంది పరిపరిగతులచే పరుగులు వారి-చిరకాలమునకు
ప్రసిద్ధమైరట్లు-యోచించి బుద్ధికి నంతవు రంజిల్లు-చూచినచో నది
చోద్యంబుగాదు-విరివిరాకడేయూల విస్ఫూర్తిమూఖ్య - వరదుండనోట
నీవాంఛ దీర్చుటకు-సందియంబును లేదు సక్కబ్బితిని-మందబుద్ధిని
మాని మదినెంచుకొనుము॥

బ్రహ్మంగారి కుమారులు వచ్చుట - ద్విపద

ద్వి॥ శ్రీ విశ్వకర్మ ఈశ్వరుని మహానుభావుడౌ శ్రీవీరబ్రహ్మేంద్రుడయ్యె
వారికుమారకద్వయమునందున్న వీరాశయుండు గోవిందయ్య మరియు
పోతులూరయ్యయు భూరి కొప్రసిద్ధ ఖ్యాతిచే వారు విద్యా విశా
రదులు చారులవల్ల నీసంగతి దెలిసి-ఘోరి కోపోద్రేక పూరితులయ్యు
పరుగున నేతెంచి భక్తిచే తండ్రి-చరణాంబుజములకు సాగిలి మ్రొక్కి
వినుతించిరత్తరి వేడ్కమీరంగ-వినయ విధేయతల్ విస్తరిల్లగను॥

కుమారులు - కింగార్థము

వందనము జనక బ్రహ్మానంద సదానంద భరితసయు సుజ్ఞానా
నందిత భక్తజనార్చిత కందర్పాంచిత శరీర-కలుషవిదార,
సంచితపూర్వ కర్మసంహారా పొందుగ నష్టాంగయోగ మునిభావ్యభావా!
వందనమిదె సర్వవందిత మహోదార, కలుషవిదార.

వ. అని యిట్లు సాష్టాంగ నమస్కారం బొనర్చిన కుమారుల లేవనెత్తి
శ్రీ విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారు "పితృశుశ్రూషా
ర్భవతు" అని ఆశీర్వదించి నంత, పోతులూరయ్య వినయంబుగా

అర్ధ గీతాళం: జనక మాకు నొక్క సంశయంబు ఘటించె హీనకులుడు
దూది నేకువాడు వచ్చి మీ కటాక్షవశుడు గావలెనని
కోరియుండినాడట నేటికి - రాకూడదిక నిమ్మాటికి
కోరివేడినను కులహీనులకును మేరగాదు సత్కార్యము సేయ। నేటికి॥

బ్రహ్మంగారు కించానం
విరప్రబ్రహ్మలార మీారలు గురుతరముగ నెంచనేల కులమున్యాదల్
మొదగ చే శేష.కులముని పరికింపగ నేలవన్న — పన్నితులెల్ల అది
తెలియును సాహరులెల్ల పరిపరి సంగతు లరయుచు
బహుశాస్త్ర పము లెల్ల కులమని మొరిగేసు సుజ్ఞాన |పద్ధతులెల్ల|
గోవిందయ్య - దరువు
1. నీచజాతివాడనగుట నీకు తెలియుదా సిద్ధా
నీచజాతి మరచి పలుకు నీకు ఏమాకు సాటిరా |నీచ|
2. నాదమేల నీవు మా పాదముల బట్టనేల
కాదంటు కారణంబు లేదు లేదు శిష్యరా |నీచ|
3. భీతిలేక మాతోడ నీతులాడ జాతిరుబు
ఖ్యాతిలేదు చెప్పు చేతలె తెలంగున జాతువురా |నీచ|
4. నీ కులంబువారిలో ననేక పెద్దలున్నారు
మాకు మీకు పొత్తుగాదు లోకులు పలుగాకులు |నీచ|
5. ఎన్ని చెప్పినను వినకున్న హేతు వేమిరా
మన్ను మిన్ను తెలియుదా చన్ను గుడుచు వాడవా? |నీచ|
6. గంపు మీారి మెండులాడ గంపమింక వచ్చురా
మొండిబండ నావివలె నుండు లేమి దండిరా |నీచ|
7. విడివిగాను పోతులూరి వీరగురుని కరుణ యింక
నిరిలమై వెలుంగుకలన, నేటి దనుక బ్రతికితివి |నీచ|
పోతులూరి వారి శిష్యుల దరువు - కాంభోజి ఏక
పోతు! ఎవడురా ! ప్రవిమలసిద్ధు డెవడురా, సిద్ధుడనువాడెవడురా !
భువిలోన మావంటి పుణ్యులు స్తోత్రము జేయు
భవుడు సారసభవుడు లక్ష్మీధవుడు కలశోద్భవులు జాలరు |ఎవ|
సిద్ధ! ఎందుకుం నాతో వాదమెందుకూ నా సందేహ మెందుకూ
ఎందుకు మీా పాదద్వంద్వము కృతార్థమల
మందు సల్పినవాడ స్తుతి నొందజేయుగ రాదె దీని |ఎం|

పోతు॥ హెచ్చుటా నాతోనా నీ ముచ్చటా ? బ్రతుకక నేల చచ్చుట
మచ్చికతో మనిమచ్చులాగున వచ్చి
మచ్చరము విడి చెచ్చెరను దుష్ట్వ్యచ్ఛబలి కేడి తుచ్ఛుడగునీవెవ॥
సిద్ధ॥ మాటికి సన్నిడనాః నేటికీ తలమ్ముమవిడన్ ము మ్మాటిక
సూటిగా నా మదిని నాట సుజ్ఞానము
దీటుకొల్పెడి భక్తగో-వ్యక దిక్కు-కారని వేడి మ్రొక్కితి 'ఎం'
పోతు॥ గట్టిగా మా తండ్రి పదములు బట్టగా, గిట్టక మేము తిట్టగా
చుట్టు తిరుగుచు నెట్టెట్టులో పలుకుచు
చుట్టావలెనే తట్టు దలక పట్టువిడువవు మట్టెదను నీ వెవడురా!
సిద్ధ॥ వీడనూ, నే పసులను వేడను, దుష్టులను నూడను
ఏడి నా ప్రభుడు యీరేడు లోకములందు
లేడనుచు వెరనమ్మియుంటిని, నీడనిడు భూజాతెం... మీరా ।కెం।
పోతు॥ శంకగా, అంకెకురాడే వంకగా, తలపడెంప్రైన బొంకి గా
శంకరాఖ్య కవి సంతసింపగ బ్రోచు
పంకజాక్షుండయిన వీరబ్రహ్మమున కింక నెవడురాడె 'నెవడురా॥

సిద్ధుడు — మత్తకోకిల

స్వామినే మును నాశ్రయింపగ జాలితిని దయురానికి
క్షేమి కారణమయ్యె నన్నిటు కాంక్షలుడని యెంతే
వేమతిన్ బరిశుద్ధిచేసి వివేకమిచ్చియు గానవే
తామసింపక పోతులూరయ ప్రైవరూప దయానిధీ

## అష్టకములు

1. తల్లికిని నీవ్ సుతుడవందురు యెల్లలోకములందునా
తల్లికిని నీవె మగడవనియెడి తత్వమే నిజమ్మెసదీ
తల్లిదండ్రులు లేక పుట్టిన దైవమే నీవందుమా
యుల్లమున కిది నిజమే ? పోతు లూరి వీరకృప సిద్ధే.
2. సుతుని సుతునకు తండ్రివైతివి సుతుని గుణమే యెరుగవ్వా
సుతుని తల్లికి సుతులు నాల్గురు స్తుతులు చేయుచు చుందురూ

సుతుని తల్లికి జన్మలేదని సుతుసలోనే యుంటివి
యుతెడవో నీ మహిమ పోతులూరి వీరకృపానిధే

3 ఆలికని నీవు కొడుకువై యొక యాలి చెంత నేయుంటివి
ఆలిమాటలు వినియు దెబ్బలు నామెచే గైకొంటివి
ఆలుమగలకు వేరులేదను నర్థమే నీవంటివి
లోలుడవు నీవవుం ? పోతులూరి వీరకృపానిధే.

4 మామవై యొక భార్యనిచ్చియు మామ కల్లుడ వంటివి
మామ కూతురు కూతురంటివి మంచివావి యటంటివి
మామనే తలమొత్తుకుంటివి మామలోపల నుంటివి
ఓ మహాత్మ విలాస పోతులూరి వీరకృపానిధే.

5. అన్నకును నీవు తమ్ముడైతివి, అన్న కన్నయు నైతివి
అన్నవని చెల్లెలతో సంసారాబ్ధి దేలుచునుంటివి
అన్నివిధము లెఱుంగువాడవు అన్నవే నీవందురూ
ఉన్నతోన్నతదివ్య-పోతులూరి వీరకృపానిధే.

6 బావకును పెండ్లామునిచ్చియు బావపుత్రుడ నైతివి
బావమరదుల కిన్నరికిన్ బావనై నీవుంటివి
బావ చెల్లెలి కన్నవైనివి భావమెన్న రెరింగిరో
ఓ విశేష విలాస పోతులూరి వీరకృపానిధే.

7. మరదలికి నీవు మామవైతివి మరదలికి మగవైతివి
మరదలికి నీవు తండ్రివై, విస్మయము నొసంగుచు నుంటివి
మరదలికి నీవు బావవని మూఢులానవుల్ భ్రమగాంతురూ
యురగ రాట్భూషణుడ పోతులూరి వీరకృపానిధే.

8. ఈకలోకలులేక లోచెడి కాకికంట్లో నుంటివి
కాకికంటి నడాన కానని లోకమున్నదటంటివి
యేకమయ్యు ననేకమై నీవే ప్రాకటముగా నుంటివి
లోకు లెఱుగరు నిన్ను పోతులూరి వీరకృపానిధే.

ఓమ్

పోతులూరయ్య సీసార్థం

ఓరి నీకీ వెఱ్ఱియూహ లెందుకు భ్రాంతి జనియించు మానవుల్ జగతిలోన
దారాసుతాదుల దగు బంధువులతోడ ధనధాన్యసంపద లనుభవింప
గోరుచుండుదుగాని గురుకారణంబని కోరుదువా యింతకొరతపడగ
తగదురా యిటువంటి తాత్పర్య మరయంగ గురుసేవ నీ
కెట్లు దొరుకురా, ఆనందమును, భావమందే యుకు టరుదురా
దేవజీవభావాతీతంబగు దేవరహస్యము చెల్పగ సద్గురుసేవనీ కెట్లు

గోవిందయ్య, పోతులూరయ్య, సిద్ధయ్యల దరువు

గోవిం। ఏలా నీకిదిమేలుగాదురా, జాలినీకేల ।ఏలా॥
మూలములేనట్టి భవజాలముల దేలు నీకు
చాలునిట్టి కాలజ్ఞానలీల, లెల్ల జెప్పగల ॥ఏలా॥

సిద్ధ। భావమందుమిమ్ము నమ్మితీ [illegible] పూర్వజీవభావము బిమ్మి నమ్మితి
దేవ తావక కరుణగాంచి [illegible] నను మించీ
నీవు నేనని యేటిభావా భా[illegible] గోవానుయీవే ।భావమందు।

పోతు। ఇట్టిమాటలుగట్టిపెట్టురా, ముట్టబోడదు, పట్టరానిపట్టు విడువరా
వట్టిరట్టు దిట్టపరచ కట్టకొట్టి తిట్టెదాను
నెట్టెదాము గట్టిగాను చట్టుతనమూ బట్టనీకు ॥ఏల॥

సిద్ధ। ఇట్టుల సెలవియ్య బోకుడి పోతులూరయ్య పట్టినట్టిగట్టి నమ్మినాడ
దిట్టముగ మీదివ్యచరణము లెట్లులైనను పట్టువిడువను
బెట్టిదముగ కొట్టినన్ బడనెట్టినన్ గురుపెట్టుచూచును ॥ఇట్టుల॥

గోవిం। నీతిజూడ జాతిగాదురా యీతీరున భీతిపడటుట ఖ్యాతిగాదురా
హేతువేమో తెలియరాదు భూతమందీ శక్తిలేదు
ప్రీతిలేకనా విభూతి జ్యోతిచేతి కందరాదు ॥ఏల॥

సిద్ధ। జాతిభూతి లేనివాడను గోవిందయ్య రీతియేదో బుద్ధిచూడను
పోతులూరి వీరగురుని చేతగాని భీతిపోదు
నాతలపు సీడేర్ప నీవే నీతినాథా, నేర్పుమయ్య ॥జాతిభూతి॥

పోతులూరయ్య, సిద్ధుడు పద్య - ఆనందభైరవి - ఆది

పోతు। చిక్కునా బ్రహ్మము దక్కునా సిద్ధా నీకు చిక్కునా
చిక్కదయ్యా బ్రహ్మభోగము, చక్కనౌ గురుపాదపద్మము
నిక్కముగ నమ్మనివారికి చిక్కునేమోకాని, మాయకు ।చిక్క।

సిద్ధ। ఎందుకూ వాదమెందుకు, అయ్యానాతో ॥ఎందుకు॥
ఎందుకునాతో వివాదము, నెప్పుడూ సద్గురుని పాద
ద్వంద్వమును నెరనమ్మికొలిచేటందుకే జన్మించినానిక ॥నెందు॥

పోతు। శాంతయుక్తత తెలియకను సామంతుడై కలిమాయవాదుల
చెంత వింత లడంచగా నిక నెంతమాత్రం బైనగాని ॥చిక్కునా॥

సిద్ధ। చిన్నతనమునాటినుంచి, కన్నపుత్రుని మారుగానే
నున్న సంగతి నెఱిగి గురుడు ప్రసన్నుడై రక్షించడా ॥నీకెందు॥

పోతు। కులము నాసన కలిమివాసన కొలిమిలో దిగ నూదిమూసను
కలుషగతి దొలగున్న వారికి కలుగునేమోకాని బ్రహ్మము ॥చిక్క॥

సిద్ధ। కులము కులమని మాటిమాటికి కలవరము నిందించెదవు నా
కులముతో పనియేమి ఘనుడౌ గురుడు నను రక్షింపడా ॥నీకెందు॥

పోతు। తనువు మనసు ధనము గురునకు ధారవోసి యాలనువోసి అలఘు
శాంతము సందినా బ్రహ్మాది మార్తులకైనగానీ ॥చిక్క॥

సిద్ధ। తనువు ధనము మనము నాడే, వినయముగ నర్పించియుంటిని
కనికరంబున నీరగురుడిక గాంచినను రక్షించునీకిటు ॥లెందు॥

వ। అని ఈ ప్రకారము మాట్లాడుచున్న వారి మనోభావంబు గ్రహించి
శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారున్ను గోవిం
దమ్మగారున్ను దూదేకులసిద్ధుని బిలచి యిట్లు చెప్పదొడంగిరి.

బ్రహ్మంగారు, గోవిందమ్మ, సిద్ధుల సంవాదం దర్వు జాతిస్వరూపం ఆదితాళం

బ్ర। సిద్ధా ! బుద్ధా ! యిద్ధాత్రిని పద్దులేదు
శ్రద్ధలేని పద్ధతిగల సద్ధర్మము వ్యర్థమగును ।సిద్ధా।

సి। ఏమీ ! స్వామీ ! నా మీద నీకృపగలుగదు
నా మనసున మీ మహిమను పై మిక్కిలి ప్రేమగలిగె ।ఏమీ॥

గోవిందమ్మ। ఏలా ! మేలా ! చాలగ మిము గొలుతున నెడి
మూలము తెలియగ తరమా ఈ నివపులకయిన గనగా ।ఏలా॥
సి। జననీ ! వినుమీ ! మనమున కెదురాడజాల
వినయముగను, పరము చెల్వు నినుతి జేతు ననవరతము ।జన॥
బ్ర। వినుమా ! కనుమా ! యనుమానము విడువు వేగ
మనసు నిలిచియున్న యనుప్రాణ, ఘనపదంబు నెరుగనౌను ।విను॥
సి। గురుడా పరుడా పరమాత్ముడ నీ వనెదను
యెరుక మరుపులేనియట్టి పరిపూర్ణము గురుతు చెల్వు ।గురు॥
గోవిం। చేటా ! మాటా । శాంతమగని సాటాలేల
తాటోటగు మాటలతో, పాటపడు నె పరతత్వము ।చేటా॥
సి। అమ్మా ! కొమ్మా ! యిమ్మహి మిముబోటివారు
ఇమ్మగ నమ్మిన వారిని, సమ్మతింపకుందురె ॥అమ్మా॥
కం. అని గోవిందాంబికయున్ దనలుచు వాకొనుట నాలకించి కడు సంతోషమునన్
మునికొని బ్రహ్మముగారిట్లని చెప్పందొడగి రప్పుడాశ్చర్యమునన్.

బ్రహ్మంగారు — ద్విపద — ముఖారి

ద్వి।వినుము గోవిందమ్మ విశదంబుగాను-మనసు నాలోచించు మర్యాద నెంచు-పోతులూరా ! నీవు పాలుపొంద వినుము-జాతిభేదము లెంచ సహజంబుగాదు-ప్రాణ్యంగటులనుండు ఫాలాక్షుడెరుగు - అప్పులకైన నయ్యది యంటగలదె-మర్మంబు తెలియగా మాధవు దరమౌ-నిర్మాణ మహిమ వాణీశుడెకనడు-పలుమారు కులమని వల్కుదు రేల కులము నేమని చెప్పకుందురు మాయ-జనని గర్భంబున జనకుని వీర్య-మున గూడిపిండమై మురికికూపమున-పడితల్లడిల్లుచు బయలుగానకను-వడి చెడియును దుఃఖవాసనన్ గనుచు-మునుకొని నవమాస పూర్ణంబు గాగ-జననమౌ ధాత్రిపై సర్వప్రపంచ -భ్రమలచే జిక్కి, నిరాకారు మహిమ-తమ బుద్ధిదోచదు ధరజనావళికి-శ్వేతర క్తకులంబు చెప్పగా నేల-వాత పైత్య శ్లేష్మ భరిత రోగముల దుంప, దీనికి నేమి తోచక నుండు-గంపెడు కోర్కెలు గలుగు మోహముల-తనసొమ్ము తానని తనవారలనుచు-వెనుక ముందరనక వెట్టియైయుండు-పరిపరి గతులచే

పరుగులెత్తుచును-గురుపద ధ్యానంపు గురు తెరుంగకను చిన్మయా
కారుని చేరనేరకను-తన్మయావస్థల దవిలి వర్తించు - కాలమెల్లను
వృధాగడపుచు తుదిని-కాలునిచే బాధగలిగి ఘోరముగ-నరకంబులో
బడి నానా ప్రకార-పరిభావముల దుఃఖపడు జీవులకును చచ్చుట
పుట్టుట సహజమైయుండు-ముచ్చటగా విన మొదలు లేకుండ-అనిమరి
వీపూరియాఖ్య కవీంద్రు - వినుతుడౌ బ్రహ్మమిట్లనె సిద్ధుతోడ।

చ. వినగదరోరి సిద్ధ ! యిట్లు నెట్టితనంబున గోరినట్టి యీ
పని యెటువంటిదంటె, కడుభ్రాంతులచేత నిమగ్నులౌ జనుల్
వనిత సుపుత్ర బంధుజనవర్గము బాయగజేయు మోక్షసా
ధన గొనువారికెల్ల నవి దక్కుట దుర్లభమిద్దరాస్థలిన్।

తే।గీ। అయిన గానిమ్ము యీశ్వరి యభిమతమ్ము
గాంచి యోచింపగా దగుగాని, కారణంబు
మిగులగా నివ్వగూడదు మేలుగాదు
అనితలంపగ నీశ్వరి యపుడు వెడలె.

ఈశ్వరమ్మగారి రాక - ద్విపద ముఖారి

ది॥ శ్రీమహేశ్వరి యోగ చిన్మయాకారి - ధీమతి సుజ్ఞాన దివ్యప్ర
సూన - శ్రీకరచారిత్ర శృంగారగాత్ర - లోకపావని సర్వలోకైక
జనని - భూలోకసంజాత భువనవినుత - నీలకుంతలవేణి నిత్య
కల్యాణి - అవివాహిత శ్రీక యనఘ సుశ్లోక - అవనిలో నీశ్వరి
యనుపేర వెలసి వీరసద్గురు కృపావిభవంబువడసి - ఆరయ
భక్తాళి నరయవిచ్చేసె।

కీర్తన - కల్యాణిరాగం - అటతాళం

జనని ఈశ్వరివచ్చె సభకు, సంభ్రమమున సర్వలోక జననీ ఈశ్వరీ
పల్లవి। జననివచ్చెను జనములకు నాశ్చర్యకరమై చూడ చక్కని ఘన
కళాపరిపూర్ణ విగ్రహ, మని సదా ఘను లెన్నుచుండగా ।జనని।

1. కరమున దండముతో, పాదుకలతో కాషాయ చేలముతో
మెరయుకుంకుమ రేఖకాంతులు మించి బాలార్కుని జయింపగ
వర సుముక్తికహారములు శుభ్రాంశు కరముల బరిహసింపగ

2. కరకంకణ ధ్వనులు, ఘల్లున మ్రోయుగాను బంగరుసొమ్ములూ
విరులు పాపటసరులు వెలయగ వినతులై తరుణీమణులు చా
మరములను వీవంగ మెల్ నెఱి, కురులజ వ్రేలాడుచు ండగ।జనని।
3. కాటుకకన్నులతో నొయ్యారంపు మేటికిరీటముతో
హాటకాంబరదీప్తి దిక్కులు మేటిధాతువు లుగ్గడింపగ
సాటిసరి లేనట్టి కలుష మహాటవికిని కుఠారమోయన ।జనని॥
4. పండు వెన్నెల రీతిగా, దుర్జనులకు గుండెఝుల్ ఝుల్ మనగా
అండపిండాండంబులకు బ్రహ్మాండగోళంబునకు నవ్వల
నిండి వెలుగుచునుండు నిత్యాఖండ ఘనఘనుల భినుతింపగ ।జనని॥
5. ఇందు సత్కాంతులను, గెల్వగజాలు, మందహాసముతోడను
కందిమల్లయ పాలెమున మణిమందిరంబున వెలసి భక్తుల
నందరిని రక్షింపదగి యానందపరవశయై రయంబున ।జనని ఈశ్వరీ॥

ఈశ్వరమ్మ - కందార్థం

దండము సద్గురు శేఖర దండము అల్లాడుపల్లె దైవచిదంశా
దండము సురభూసురనుత దండము శ్రీపోతులూరి, దైవవరేణ్యా
బ్రహ్మాభిఖ్యభక్తశరణ్యా అండాండ పిండాండ బ్రహ్మాండముల కెల్ల
దండినావల వెల్గా ఖండస్వరూపయో, దైవవరేణ్యా ।బ్ర॥
వందనము భక్తవందిత వందనము దయాపయోధి వరదాయక నా
వందనము మత్పితామహా వందనమిదె పోతులూరి వంశప్రదీపా
సదానంద వైభవోద్దీపా సుందర వదనారవింద సదానంద
మందిర ద్వార కవాట పోతులూరి, వంశప్రదీపా సదానంద వైభవోద్దీపా

వ। అని ఇట్లు ఈశ్వరి వీరబ్రహ్మేంద్రసాములవారి చరణ ద్వంద్వంబు
నకు నమస్కరింప నా జగదీశ్వరిం జూచి బ్రహ్మముగా రిట్లనిరె.

బ్రహ్మంగారు కందార్థము

మోదముతోడుత వినవే దూదేకుల సిద్ధుడిపుడు తొలిజన్మఫలం
బాదేశం బయినందున వేదాంతరహస్యమెల్ల వినగోరినాడూ,
వలదని చెప్ప వినడాయె పీడూ ఆధారమగు ముక్తిసాధన గోరితె
యేదారి జూపుదు నెందు బొమ్మనబోడు ।వినగోరినాడు॥

వానిమన సెట్టులున్నదో జ్ఞానము గావలయునన్న గాని జడులకున్
బూనిక చెప్పట కూడదు
స్వానుభవం బించుకైన నగపడుదాక, వానిచర్య లగుపడుదాక
జననీజనకులైన తనయుని గుణములు
కనిపెట్టవలెగాక కసికారముండిన నగుపడుదాకా

వ. అని యిట్లు స్తోత్రంబుచేసెడి యీశ్వరమ్మను గనికరమొదవ నాశీర్వదించి యున్న సమయంబున సిద్ధుడు జగదీశ్వరి పాదకమలంబులకు సాష్టాంగదండప్రణామంబు లాచరించి స్తోత్రంబుసేయుదొడంగె

సిద్ధుని దర్వు

1. వందనమమ్మా! జగదీశ్వరీ! వందనమమ్మా
వందనమిదిగో యానందస్వరూపిణి
బిందునాదకళ జెందియున్న జనని ।వందనమమ్మా॥

2. ఈడ పింగళలు, నడుమనెయున్న నాగకన్నియను
ఉడుగక విడువక జడవాక యెడగాక
తడవుసేయక యుండు తాండవరూపిణి ।వందనమమ్మా॥

3. పంచభూతములా, సంచితములణంచి కొంచెములా
యెంచి యెంచకను యేవంచనలేకను
మించియున్న యో ప్రపంచస్వరూపిణి ।వందనమమ్మా॥

4. కొంచపువాడ యెంచకను దలంచుదుగూడ
పంచశక్తులు నీవై మించు పరాశక్తి
వంచునమ్మించెడి పంచబ్రహ్మంబశినీ ।వందనమమ్మా॥

5. కారణుడమున్నా దురీకృతాచారుడను నన్నా
వేరుసేయక నీదుకారుణ్యమిచ్చియు
దారిదెల్పుము పోతులూరి యీశ్వరీ నీకు ।వందనమమ్మా॥

6. పంకజనేత్రి, వీరగురు నామాంకాదిషాత్రి
శంకలేకను కొండ శంకరాచార్యకవి
సంకల్పములనిచ్చు సత్యస్వరూపిణి ।వందనమమ్మా॥

దర్వు — తోడిరాగం

అడిగినప్పుడు చెప్పగూడునా ? బ్రహ్మానుభవము, పరశివయోగం ।అడి॥
అడిగినప్పుడు చెప్పటకు యిది పడుచుటాటల భ్రాంతిజన్యము లుడిగి
నిర్మలముగను మాయనుగడచి నిలచినస్వానుభవమును ।అడి॥

1. తనువు ధనమును సంపదయు తానెనసియుండిన గురునిసొమ్ము
వెనువెనుకనె గానుకొని బహు దినదినంబులు సేవజేయక
గుణకులవి మూడడగిపోవునా ? జీవేశ్వరులకు తనువులుండిగెడి
తావు తెలియునా ? షడ్వర్గములో దుడుకులవి బడవన్నకుందునా
అనయమును షట్శోభితంబును ఆత్మతత్వము తెలియలేకను
శునకముగ తనబుద్ధితిరుగగ మనసు నిలకడలేనికర్మికి ।అడిగి॥

2. టక్కునను సంసారజలధిలో, ముక్కుముంచుక మునిగి, అందులో
చిక్కి పొరలుచు నింద్రియంబుల టక్కరెరుగగ లేక పెద్దలు
పెక్కుసంసారంబులు విడచిరి మోక్షముకొరకై
చక్రవర్తులు పదవి బాసిరి, రాజాధిరాజులు
గురుని పంచను కాచియుండిరి ఋష్యాదులంతా
దిక్కు తెలియక యడవికేగిరి
నిక్కముగా మోక్షంబుజెందెడి నిలకడదియని బలుకనేరక
దక్కినట్లే మాటలాడి, దయకుపాత్రుడ నన్నమాత్రాన ।అడిగి॥

3. నిరతముగ తాపత్రయంబుల మరగి కన్ను మిన్నుగానక
పొరలుచును విషయాదిగుణముల పోడిమెరుగక నరులు కొందరు
దురితములబడి పొరలుచుండిరి మరుగెరుగలేక
నరకకూపమునందు నుండిరి పరవస్తు తెరుగక
మరల బుట్టుచు చచ్చుచుండిరి
పరముడగు శ్రీ పోతులూరి గురుడు వీరబ్రహ్మచరణ
సరసిజద్వయ మంటజాలక, దరియుదారియు లేనివారికి ।అడి॥

వ। అని యీ విధంబుగా ఈశ్వరమ్మగారు సెలవిచ్చు సమయంబున
పూర్వజన్మోపదేశ ఫలంబున దూదేకుల సిద్ధయ్య హెచ్చరిక జెంది
నవాడై నమస్కరించి యిట్లనియె

సిద్ధప్ప ఈశ్వరమ్మ సారల - దరువు - మధ్యమావతిరాగం

సిద్ధ। జననీ ప్రమొక్కెద యీశ్వరమ్మా।నను దుర్జనుడనితలపకుమమ్మా
వరుసగ మీపాద వనజాతములు నాహృ
ద్వనజపీఠంబున నునిచి పూజించెద
ననుదినంబులు దినకరునికై వనజ సంఘము కోరినట్లుగ
ననువుగా దేహేంద్రియాదుల నర్పణము గావించి వేడితి ।జననీ॥
ఈశ్వ। సాధింపరాని సుజ్ఞానము సిద్ధా సచ్చిసదానంద ప్రభావమూ
మోదాముచే గురుబోధాత్ముడై మత భేదాము నొంది
దుర్వాదము సేయక
సాధకంబు వహించి త్రివిధ ప్రసాద ధన్యుండౌచు పూర్ణ స
మాధినిద్రను జెంది తన్మయుడగుచు నాచిన్మయుడు గావలె ।సాధిం॥
సిద్ధ। ఏదారి తెలియనివాడ నన్నాదరింపుడు దయతోడ
యేదారిజూపినయీశ్వరీ! మీరనినాదుమనంబున నమ్మియున్న వాడ
ఆదరంబున జూచి మీర లనాది మూలము దెల్ప మాయను
పాదువిడ దెగగోసివేయుడి. పాదములు విడువంగజాలను ।జన।
ఈశ్వ। నిరత ప్రకాశముజూడ సిద్ధా। నిజసద్గురుడు జూపుజాడ విరివిగ
కడిమూల వీపూరియాచార్య వరదుడైన వీరబ్రహ్మము. ఘనపాద
స్మరణచేయుచు నాశ్రయింపుము కరుణగలుగును వారిచే, సుస్థిర
పదార్థంబైన జీవనమును ఘటించి ఘనుడవౌదువు ।సా।
క।అనిచెప్పి మరియునీశ్వరి మనమున హర్షముజెలంగ మధురామృతముల్
దనరగ నిట్లనియెను యో ఘనపుణ్య చరిత్ర సర్వకలుషలవిత్రా!
చ। వరగుణశీల! నాదు ఘనవాక్య మమోఘము గాన వింటివా
పరమ రహస్యమా నిదియు బట్టబయల్ సరిలేనిదీమహా
స్ఫురిత నిరామయంబు పరిపూర్ణము నామకళావిసర్జితం
బరుదుగ ప్రమొక్కి వేడిన మహాత్ములు దెల్పరదెంత వేడినన్

కీర్తన మధ్యమావతి రాగం - ఆటతాళం

1. వట్టిమాటల ముక్తిలేదూ, యోగ, దృష్టిచే జూడగరాదూ గట్టిగ
గురుని చేపట్టి షడ్వర్గము, నెట్టివేచరి పూర్ణదృష్టిచూచినగాని ।వట్టి

2. విద్యాలు చేర్చినలేదు బ్రహ్మవిద్య తెలియక బోధగాదు సుద్దులు
మాని నిబద్ధిగ గురుపాద, పద్మమునమ్మి నిర్నిద్రులై తెగాని ।వ।
3. నాదము వీనుల వినుచు, మోద, ఖేదాము సమానముగాననుచు భేద
వాదములను పోద్రోలి సద్గురు, బోధనంది జ్ఞానయోధులైనగాని ।వ।
4. సంశయంబులనెల్లమాని, పరమ హంసానె మర్మము బూని హింసలు
జేయక హంసోహం మనుచును సంసార ముందు నిస్సంగు లయి తెగాని
5. ధరణిపోపల పోతులూరి వీర, గురుడు చెప్పిన యిట్టిదాని పరము
దెలుసుకొని పరిపూర్ణభావము కరుణజెంది మోక్షకాలమయి తెగాని

కథను తెలుపు ద్విపద

ద్వి। అప్పు డమ్మహాదేవి యగు నీశ్వరమ్మ – ఉపమానమగు యుక్త
లూహించి – పిదప – సిద్ధుండు తామన స్విష్టుండు నగుచు – బుద్ధి
నాలోచించి పూర్ణానుభవము – గోరి ప్రార్థించు సద్గుణులకు నెల్ల–
నారీతి నొసగుట యార్యసమ్మతము–అశించు శిష్యుల నట్లు పోమ్మ
నుట – గాసి పెట్టుటగాదె కనికరంబుడిగి–యని పలుమారు సహా
యవాక్యములు – వినుపింప దొడగి గోవిందయ్యగారి – ముందర
నిలిచియు మోదమెలర్ప – వందనంబులు జేసి వరుస నిట్లనియె –
యిద్దరు వినగ నీ ఈశ్వరీ దేవి – చెప్పిన వాక్యముల్ చెయొగ్గి
వినుచు – మెప్పుగానుంటిరి మీ రైన గాని – ఉపదేశమునకర్హుడు
పమింపవీడు – చపలుండుగాడు నిస్సంశయుండనుచు – సెలవివ్వ
రయితిరి శరణుజొచ్చినను – విలసితౌదార్యగోవింద యాచార్య!——

గోవిందయ్య - ఈశ్వరమ్మ - పోతులూరయ్య - సిద్ధయ్యగారల సంవాదం
దరువు - ముఖారిరాగం

గో। హీనకులుడో మానవున కీ జ్ఞానమార్గము చెప్పకూడదు
పెద్దలూ – వారే వ్యర్థులూ
ఈ। ధరణిలోపల నెవ్వడేనియు గురునిదయ మదికోరకుండుట
కర్మమూ – యిచ్చే – ధర్మమూ
సి। తల్లిదండ్రులు మీరు నాకని యెల్లవిధముల గోరితిని మీ
పాదమూ – లేదిక, భేదము

పో॥ మరియు వీనికి నాత్మలోపల మర్మభేదము లేదు కారణ
మిచ్చుటా - ఆర్యులు మెచ్చుటా
గో॥ ప్రభుకటాక్షము వచ్చునంత శుభంబు వీనికి గలుగునాత్మా
నందమూ - బ్రహ్మానందమూ
ఈ॥ ధారుణీ కడియాలవర వీపూరియాఖ్యక పీంద్రపోషక
బ్రహ్మమూ యిచ్చును మర్మమూ
అర్థ.కం॥ కారణమది గావలెనని కోరినయెడ నీయవచ్చు గురినిల్పెడియా
ధీరుండగు శిష్యుని గనయారూఢిగ నంచు జెప్పి రార్యులూ
అయితేనే యాచార్యులూ, వారే గుర్వాచార్యులూ
ఘోరదుఃఖసంసారవార్ధి దరిజేసు మార్గమున ధన్యునిజేతు రార్యులూ
బ్రహ్మంగారినిగూర్చిన యాలలు

1. శ్రీగురుని మానసమున సేవజేయుచుండువారు. ఆగామి కథలెల్ల
దెలిసియూ ఓరి సిద్ధయ్యా త్యాగభోగ యోగ్యులైనారు-ఓహోరి సిద్ధా
రాగరహిత భోగులైనారూ...
2. నిత్యానిత్యవస్తువివేక మత్యంతాసక్తులైయున్న సత్యజ్ఞానానందు
లాదురు ఓరి సిద్ధయ్యా సత్యమే పరబ్రహ్మ మందురు ఓహోరి సిద్ధా
నిత్యమే పరవస్తు వందురూ
3 హింసలెల్ల యెడముజేసి యీర్ష్యదంభాసూయాదులధ్వంసమూ
జేసిన వారలూ ఓరిసిద్ధయ్యా హంసోహంసు
ధ్యానశీలురు ఓహోరి సిద్ధా- హంస పరమ...హంసులయినారు
4. శ్రీవిరాట్ పోతులూరి శ్రీ వీరబ్రహ్మముల పాదసేవ జేయునట్టి వారలూ
ఓరి సిద్ధయ్యా భావభావా తీతులయినారు ఓహోరి సిద్ధా
సావధాన పరులయి యున్నారు...

బ్ర॥ద్వి॥ వినరోరి సిద్ధ నే వినిపింతు నింక - తను వింద్రియములు నుద్ధతి చిక్కబట్టి కొనియాడెదవు యేమి కోరిక వెలసె - వినుపింపు మది లెస్స వేడ్క రంజిల్ల - అందుకు పరమేశు నాజ్ఞ నేరీతి జెందియుం డునో మీద జెప్పెదగాని - సందేహ పడనేల సత్యవాక్యముల - ముందు భక్తాదిమును లనేకులును పరితాప మగ్నులయి బహు

ఘోరమైన ఘర దేవతతికెల్ల తప్పక మ్రొక్కి - దారుశిలారూప తతి కినర్చించి దారి తెలియక పెడదారులు త్రొక్కి - విపినాంతరంబుల విహరించి గుహల - జపతపస్వాధ్యాయ చర్యలవలన జడల గట్టిగ జుట్టి జపమాలబట్టి యొడల త్రిదండ ంబకం బొప్పగాపూసి కాషాయ ధారులయ కడతేరునట్టి వేషంబులవిగాక విసిగియుండుటయు - సీగతి నుండను యిక నీతలంపు - యేరీతి నుండునో యెఱుగ తెల్పుమదె తెలిసియున్నవి మాకు దివ్యదృష్టిగను - పలుమరు నీనోట బలు కంగనేల - వివిగా కడియాల వీపూరియాఖ్య వరముండ్న కడు వాంఛ దీర్చెదను

చ॥ అనుచును నాగుహూత్తముడు నప్పటి సిద్ధుని వేడికోళ్ళ క
త్యనుపమ సత్కృపామతిని నవ్వడనుగ్రహాదృష్టి గోప సీ
ట్లనియెను-ఓరీ! శిష్యుడనటంటివి పూర్వమునందు నే విధం
బున నను జేరితో యదియు మాలను చెప్పుము నిక్కువంబుగన్.

సిద్ధుడు సీసపద్యము

సీ॥ శ్రీ విరాట్ పోతులూర్వీర యోగీంద్ర నా
పూర్వవృత్తాంత మిప్పుడు వచింతు
బనగాని పల్లెలోపలను వసించి నీ
రప్పయాచార్యులయి మెప్పుగాను
న్యాయమార్గమున నన్నాచార్యగారికి
కరుణ కాలజ్ఞాన వరణిమీఱర
నుపదేశ మొనరించుచుండు నత్తరినినే
వెంకటరెడ్డినై వెలయుచుండి

గోవు గర్భంబు జీలిచి కోడెగాంచ కోపపడి గోవు బ్రతికించి కొంగతీసి నన్ను పింజారి వారింట తిన్నగాను జన్మమెత్తు మటంటిరి సఫలమాయ్యె!

ద్వి॥ అంతట మీదు మహాత్వంబు తెలిసి - వింతగ్గుగోచి సద్బుద్ధ్వుసు బుద్ధి - తెలిసి నే కలగన్న తెరవుజూచి పలుమారు తుద్భసు భక్తిచే జేయ - తాము కటాక్షించి దగ్గరబిలిచి - ప్రేమహాతిశయము చే ప్రియము రెట్టింప - బోధింపుచుండి యాపురముపో నూ

సాధించి తెమ్మన్న నగము రేపేళ-ఆనూనైకై నేను రతిరయంబు
నను పూని తేబోవగా పురవీధిలోన - కాననొకానొక కాల
సర్పంబు మానుగా కాటందమహిమీద వాలి దేహంబు తెలియ
కాటీరు మూర్ఛిల్లి-యూహ నెరుంగక యున్నంతలోన- మరణాం
తమై నను మావారు జూచి - పరితాప మగ్నులయి బహుదుఃఖ
పడుచు - యెక్కడి గురుశిష్యు లేర్పడి రనుచు కక్కసాన
మఠంబు కడ నన్నువైచ - జనులెల్ల జూచి యాశ్చర్యంబుగాను
- మనసుంచి మంత్రసామర్థ్యముతోడ - మంత్రవిభూతికే మరి
నాకు జీవ యంత్రంబొసంగినయా మహాత్యమున- బ్రతికితినయ్యా
మీపాదసేవకుడ హితవుగా మీకీర్తి నెన్న నావశమే అపరాధి
నిక నన్ను నాదర మ్మొప్ప - యిపుడు రక్షింపుడి యిల పోతు
లూరి వీరగురుస్వామి విఖ్యాతామూర్తి నరనుత సచ్చిదానంద
స్వరూప!

కం। వరశివయోగం బిప్పుడు
కరుణతో నుపదేశమీయ గానెంచిన జ
న్మరహస్యము దెలిసెను, స
ద్గురునాథా! కొదువదీర్చు కోరిక దీరన్
కథ తెలుపు కందార్థము
అని సిద్దుడు ప్రార్థింపగ
విని బ్రహ్మంగారు చాల విస్మయపడుచున్
తను,యీశ్వరమ్మతో ని
ట్లనియెను, యీపాటవినుమూ యీశ్వరీ,
సర్వప్రపంచా, ధీశ్వరీ నతపుణ్యజన మహేశ్వరీ!
వనజభవాది మహాత్ములకందని, ఘనశివయోగము గావలె
నన్నా ।ధీశ్వరి।

ఈశ్వరమ్మ గారి పద్యం
ఆ॥ వే। పూర్వజన్మకర్మపుణ్యవశంబున
గాని నరుడు గురుని గాంచలేడు

గాన వీడు కరుణకై! పూర్వమే, పది
రెండువత్సములు దండిగొలిచె।

సిద్దుని కందార్థం

పరతత్వాధికరూపము
స్థిరముగ వినగోరి యేక చిత్తముతోడన్
నిరతంబు సేవజేసితి
అరమరసేయంగవలదు, ఆర్తశరణ్యా కరుణించవో, యప్పాశరణ్యా
మరి హీనకులుడని మది నెంచితివిగాని
హరిషించ దగునన్ను - అభయ మివ్వక విడువ నార్తశరణ్యా

బ్రహ్మంగారు కందార్థం

సిద్ధుడ వినరా నీవు ప్ర
సిద్ధుడవేగాని, నీకు శ్రీఘ్రుతకరుణన్
వద్దిక నిడరాదన నీ
బుద్దిని వినగోరి చూడ బుద్ధిమంతుడవు లోకములో, ప్రసిద్ధి
వంతుడవు
బుద్ధిహీనులనైనా దిద్దితీర్చెదము మా
వద్దకు జేరిన వదిలి పెట్టము యింక, బుద్దిమంతుడవూ

వ। అని యివ్విధంబున శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వా
ములవారు తన ప్రియశిష్యుండైన దూదేకుల సిద్ధునికి హస్తమస్తక
సంయోగంబుగావించి పంచాక్షరీ మంత్రోపదేశంబొనగించిబోధ
మార్గంబు దెలుపి అభ్యాసవిదానం బలపరచి సాధనాక్రమంబెఱిగిం
చుచుండెను. అంతనొకనాడు సిద్దయ్యస్వామీ! కులమనగాయేమి?
అది యెట్లుకలిగెను? వాటివృతాంతము జెప్పుమనగా శ్రీవిరాట్
వీరబ్రహ్మేంద్రస్వాములవారు చెప్పుచున్నారు. ఎట్లంటే—

బ్రహ్మంగారు దర్వు - శుద్ధకాంభోజ - ఆట

1 కులమేమికనగాజీవులలోపలనురేతగ। కులమూ తనొక్కటేసిగా
కులమేమి కారణము గుణమేకారణమురా

2 హరి, కూర్మ కిటి మీన, నరసింహులుగ బుట్టె
నతని నతుక్కులమేమి సిద్ధా!
పురహరుడు శాశ్వతుడు పుట్టుచోటెక్కడ
గురు తెరుగవా నీవె సిద్ధా!

3 సురభూరుహంబులు సుధయు మున్నీటిలో
హరిరాణితో బుట్టె సిద్ధా!
గిరిరాజపుత్రియై మెరసె దాక్షాయణి
అరయ నే కుల మాను! సిద్ధా!

4, కుముదమిత్రుడు చూడ కొమరొప్ప కడలికి
కొమరుడయి పుట్టడా సిద్ధా!
సుమశరుడు మనసు కా కొమరుడు రెల్లుకూ
భ్రమియింప బుట్టడా! సిద్ధా!

5. భ్రమదీరగా వీరభద్రుండు జడమీద, ప్రభవింపడా! యెన్న సిద్ధా
రమణియౌ సర్ప గర్భమున జన్మింపడా
రహినాది శేషుడు సిద్ధా!

6. అల యజ్ఞదత్తుండు, ఆ శూద్ర వైశ్యులకు
యిలలో జన్మించెను సిద్ధా!
వెలయంగ ధృతరాష్ట్ర వీర పాండవులానాడు
వెధవలు కనలేదా సిద్ధా!

7. అండమై మగడుండ, అన్యులకు ఆ కుంతి
పాండవుల గనలేదా సిద్ధా!
పండితుడు విదురుడు, బానిస కొడుకయ్యె
పల్కనే కులమాను సిద్ధా!

8. ఒనర కపిలుడు దేవ, హూతికి నారదుడు
ఉదయించె తొత్తునకు సిద్ధా!
శునికి శౌనకుడు నాఘనుడు మాండవ్యుడు
కప్పకు జన్మించె సిద్ధా!

9\. ధీరులెన్నరు కులము, తేడాలు ధరణిలో
నా రూఢిగ, నమ్మ సిద్ధా!
కారణాతీతు డోంకార గమ్యుండొక్క-
ఘన పరాత్పరమూర్తి। సిద్ధా ?

వ. ఇట్లు చెప్పినవాడై, యాధ్యాత్మిక తత్త్వక్రమంబెల్ల నెఱిగించి కాల క్రమానుసరణి సమాధినిష్టాగరిష్టత్వంబున నుండవలయునుగనుక నిప్పుడు దేవదారి కుసుమంబులు, పండ్లు తీసుకరమ్మని సెలవిచ్చిన నాతండు దేవతలకు సుజ్ఞానమనుదారిజూపిన దేవదారిపండ్లున్నవాడని పుష్పములున్నూ, తెచ్చుటకొరకు శ్రద్ధాభక్తిపూర్వకంబుగా నిశ్చలచిత్తంబున వనమునకు వెళ్ళుచుపల్కుచున్నాడు ఎట్లనిన

స్వామివారి కొఱకై సిద్ధప్ప పూలకు బోవుట - దర్బ్వ తోడిరాగం

పండు దేవదారిపండు, పండుదొరికినవారికి పండుగై యుండూ

1\. చెట్టు మొదలు లేదు చుట్టు కావలియుండు
బట్ట బయలయి యుండు భావములో
దిట్టముగా నాలుగు కొమ్మలతో నుండు
పట్టులేని పండు పైగానేయుండూ ।పండు।

2\. యతులు యేడ్గురుగూడి వెతకిన యీ పండు
మరి సత్యవాదుల మరగియుండూ
సతులు పతులు చాల హితవుగ నుండిన
జాతిలేని పండు జగమెల్ల నుండూ

3\. అందరిలోనుండు ఆనందమైయుండు
అంది సర్వజనుల కందకుండూ
అందిన యట్టి మహాత్ముల యందుండు
సందేహ ముడిగిన సర్వమైయుండూ ।పండు।

4\. కామ క్రోధము లెల్ల ఖండించు నా పండు
బ్రహ్మాండ మందెల్ల ప్రబలియుండు
ముగ్గురుమూర్తుల కది ముఖ్యముగా నుండు
నిగమా తీతమగుచు నెగడుచుండూ ।పండు।

5. కులభేదవాదులు గురుతెరుగ రీ పందు
కులబందుగుల మాయ గూల్చుపందు
అలనాదబిందు కళాతీతమైయుండు
అలరి వీరబ్రహ్మమందు నుండూ ।పందు।

వ. అంత శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారుసిద్ధుని ప్రసిద్ధి బుద్ధిమంతులలో వ్యాపింపజేయనెంచి పుత్ర మిత్రకళత్రాదుల కెఱిగించివారు స్తోత్రంబులుసేయ సమాధినిష్ఠాగరిష్టుండయి సమాధికి తలుపులు స్థాపింపుడని సెలవిచ్చిన భేరీమృదంగాదిసకల వాద్య ప్రకరంబులుచెలంగ భక్తకోటి ధూపదీపనైవేద్యాదిషోడశోపచారంబులతో బూజింప నొడంగిరి ఆసమయంబున

సిద్ధుడు పూలతోటకుంజని పూజార్థంబైన పుష్పముల గొనివచ్చుట
ద్విపద - ముఖారిరాగం

ది। అప్పుడు సిద్ధుడత్యంతమౌభక్తి. తప్పక గురునాజ్ఞ దలచిప్రసూన-ములకునై యడవికి బోసాగె, నచట విలసిల్లు బహు చిత్రవిటపిచయంబు = చందనమందార జంబీరజీర - మందార ఖర్జూరమాలూర ముఖ్య - నానా తరులతోడ నవ్యవైఖరుల మానుగాశృంగార మండితంబగుచు - శుకమయూర చకోర శోభితరవము - ప్రకట జలాశయ బహుళభానురము - గాంచుచు నుండియు కడువడిజనగా - మించి యావిపిన సమీపసంచార- సారంగకరిసింహశార్దూలముఖ్య - ఘోరమృగంబుల గురు తరధ్వనుల - వరలు మహారణ్య వాటియంతయును - అరయగ నొకపుష్ప మగుపడదయ్యె - యీ చిత్రగతికి నాలోచనజేసి । యీచర్యలో గూఢమేదియోకలదు. నాపాలి శ్రీ గురునాథున కేవిూ కోపంబుగల్గు నోకుసుమమ్ములేమి - బ్రతుకుట పనిగాదు భక్తిచే నిచట -మృతి బొందుటే గొప్ప మేలగునంచు - అతి రయంబున భూరుహాగ్రంబు నెక్కి - రతిచేత సద్గురు రాయని దలచి - హుంకించి దుముకుట కూహింపనొక్క - వంక నప్పుడు పుష్పవనము గన్పించెనంతట

దిగివచ్చి యావనమందు-వింతలొ పుష్పముల్ వేడ్క- గ్రహించి-
చనుదెంచుచుండ నాశ్చర్యంబుగాగ - ఘనమా ప్రవాహంబు గం
గాతరంగ - సంగతంబై రాగ సంశయమొప్ప - చెంగట . నిలచి
యూస్థితి పోతులూరి - వీరగురుస్వామి విభ్రాంతిగదుర - దారికడ్డ
ముజేసె దయలేక ననుచు - వార్థి సమాన ప్రవాహంబు జూచి
ప్రార్థనతో నిట్లుబల్కె- సిద్దయ్య॥

గంగా ప్రార్థన - భుజంగ ప్రయాతం

మహాతరంగ సంగ గంగ మత్ప్రమోద వాహినీ
సహస్రకోటి శాఖలన్ విచక్షతల్ జలంగగన్
బహుప్రమోద రాశివై యుపద్రవంబు మీరగన్
అహా మదీయమైన బాట కడ్డమైతివే నదీ॥

కీర్తన - శంకరాభరణం - త్రిపుట

ఏటికెదురు నడవే మనసా యేటి కెదురు నడవే

1. ఏటి కెదురుబడి దాటే మార్గముసూటిదప్పకనుచూ పులనడుమను
కాటుకకొండలట్లనడుమ బల్, ఘాటిగగన్పడుదారిజూచుకొని॥ఏ॥
2. తడవుసేయవలదె మనసా దారియిందు గలదే
తడవుసేయకను ఘాటిమీరగనుకుడియెడముల తడబడకను నడిగా
నడినాళంబున నాగకన్యకను అడుగులో నవడుగిడుచునువడిగా॥ఏ॥
3. అనుమాన మి కేల సద్గురునాత్మ నమ్మిచాల
కనవలె వినవలె మనవలె సాధన మనసులోని నిర్మలతను పీడన
కనుగొని యమునా గంగా సార స్వతుల సంగమున వరగౌడి
చోటున ॥యేటి॥
4. అందియందకుండూ ఆత్మానంద మొదవియుండూ
అందు యిందులకు నాధారంబై అంటరికిని తానగ్రభాగమై
బిందునాదకుల భేదమెరుంగక సుందరాంగియైచూడచోద్యమూ
5. సూరిజనంబులకు యిది కడు సులభము లోకులకు
ఆరుచక్రముల కాధారంబై మేరుశిఖర సామీప్యంబై జలపూరిత
మగు నోంకారంబె యల వీరగురుని పదనీరజ సేవకు ॥ఏ॥

వ॥ అను సిద్దయ్యకు మహా ప్రవాహంబు దారిజూపకున్న దత్కాలం
బున దేశికాచార్యుడైన సద్గురు పాదపద్మంబు లాత్మగతంబున
ధ్యానింపుచు మరియు నిట్లని ప్రార్థించెను.

కం. ఎవడు మూర్తిత్రయమున
కవ్వల పరమాత్మ రూపుడై నిర్గుణుడై
నెవ్వడు సర్వమయుండౌ
నవ్వేలుగే బ్రహ్మమనుచు నాత్మ దలంతున్

సిద్ధప్ప దరువు బారువ - ఆట

1. నమ్మివచ్చితినయ్య నాపాలిదైవమ రమ్మని పిలువరా బ్రహ్మం
కమ్మియున్నది యడవి కారుచీకటినెల్ల జిమ్మివేయర వీరబ్రహ్మం
2. సోనభూములయందు వానగురిపించితివి మేనెట్లునిలచురా బ్రహ్మం
మానితంబుగ నీదుమహిమ నెఱుంగను జ్ఞానంబొసంగరా బ్రహ్మం
3. తేరకానివలెను యూరకుండిన నాకు యేరడ్డువచ్చెరా బ్రహ్మం
వేరుసేయక మీరు ధీరత్వ మమరించి దారిజూపర వీరబ్రహ్మం
4. ప్రొద్దెక్కె మధ్యాహ్న పొటయండలోపలపోరుమెండాయెర బ్ర॥
వద్దనెవ్వరులేరు వాపోవుచున్నాను బుద్ధిసెప్పర వీరబ్రహ్మం॥
5. గండుమృగములజూచి కొండలెక్కగలేక గండిలోజిక్కితిబ్రహ్మం
యెండమావులరీతి నుండె నాకిచ్చట యుండలేనుర వీరబ్రహ్మం॥
6. ఇన్ని జన్మములలో హెచ్చైన జన్మంబు నెన్ననరజన్మమేబ్రహ్మం
చిన్నతనమునుండి సేవచేసినయేండ్లు పన్నెండేగద వీరబ్రహ్మం।
7. తండ్రిగర్భమునుండి తల్లిగర్భముజేరి తరువాత జన్మించి బ్రహ్మం
గండ్రతనము వీడిగడిపిన నీసేవా కాలమెంతర వీరబ్రహ్మం।
8. సాధకమందిన సాధుసిద్ధయ్యను దింపనేమిర బ్రహ్మం
బోధరూపకమై పూర్ణభావము దెల్పి బాధలూడ్చర వీరబ్రహ్మం
9. పరికింప నన్నిట్లు పరిశీలనముసేయ, భావించియున్నావ బ్రహ్మం
విరివిగ కడియాల వీప్పూరియాచార్య వినుతులందెడి వీరబ్రహ్మం

దర్వు - యమునాకల్యాణి ఆట

ఏమయ్యా నామనవి యేమాయెనయ్యా! నాద బ్రహ్మానంద
నా గురుస్వామి।

పల్లవి। కామాదిగుణముల ఖండించి పరతత్వ
నీమాము తెలిపేటి స్వామీ! రక్షింపవే ।యేమ

1. పిలచిన పలుకావు దెలియు మాటాడవు
కలసి మాటాడని కారణమేమయ్య ।యేమ

2. కొండవటిది యాశ గొడుగువంటిది నీడ
నీడను నన్నింక నిలుపగరాదా ।యేమయ్యా

3. చలముచేతను నన్ను జాజులు తెమ్మని
సొలసి సమాధిలో నిలచియున్నావా ।యేమయ్యా

4. నింగి సమానమై గంగా ప్రవాహము
తంగుగ యడ్డమై రానీయదాయెను ।యేమయ్యా

5. తమచుట్టు దిరిగిన దయలేక నను వెట్టి
బ్రమల బెట్టదలంచి పలుకనే పలుకావూ ।యేమయ్యా

6. వృక్ష మొకటి యందు పక్షులు పదివేలు
వృక్షము విడచిన పక్షినైతి గదయ్య ।యేమయ్యా

7. తల్లిదండ్రి గురుడు దైవము గనలేక
తల్లడింపుచు నుంటి దారిజూపగ రాదా ।యేమయ్యా

8. దిక్కుగానక నీకే మ్రొక్కి వేడితిగాని
తక్కిన దైవాల దలచనో తండ్రి ।యేమయ్యా

9. ధారుణి శ్రీ పోతులూరి వీరాచార్య
చేరితి మీపాదసేవ నాకియ్యవే ।యేమయ్యా

తే। గీ। అట్లు గంగా ప్రవాహంబు నడ్డమయిన
సిద్ధు డాలోన బ్రహ్మంబు చిత్సరోజ
పీఠమందుంచి పూజింప, భీతివోవ
వారి విడిపోయి వానికి దారిజూపె.

ద్విపద। ఆలోచన సిద్ధుడత్యంతవేగమున - పూలు గైకొని రాగ
బోయిన వెనుక - పొలుపొంద బ్రహ్మంబు పూర్ణసమాధి -
నలరుటయును నప్పు డతిఖేదమొదవ - హా పరమాత్మ యో
ఆర్తసరణ్య-కాపట్యముగ నింత కనికరంబుడిగి విరులు తెమ్మని
పంపివేగ మేఘాటు-కరిగితివేల నియ్యాదనున దిక్కు - మరియెవ్వ
రయ్యా నీ మర్మమింతైన - నరయజాలక నిట్టు లలజడిగొంటి -
నని యాత్మచింతించి యా సత్సమాధి - కిని చతుర్దిశల మ్రొక్కి
ప్రదక్షిణమ్ము గావింపుచును జగత్కారణకర్త - కావవే నన్నిక
కారుణ్య జలధి నిన్ను నమ్మితినయ్య నిగమాంతవేద్య - నన్నేలవే
జగన్నాథ! యాపన్న - రక్షణా! నిత్యసామ్రాజ్య సంపన్న -
మోక్షదాయక నన్ను మోసపుచ్చితివి - పరమాత్మ (గురు)
పరబ్రహ్మ స్వరూప - యురగాభరణ పోతులూరి సువంశ -జలధి
సుధాంశ! నిశ్చయనిర్వికార!- ధీరుండవగుచు సందేహంబు విడచి -
కారుణ్యమెప్పనన్ గావగదయ్య!

(దరువు - ముఖారి రాగం)

**దేవ దేవ మహానుభావా! దీనరక్షక వందితాఖిల, నాయకా,**
**వత్సలదాయకా**

1. అరసమా! నాపై, విరసమా! విరులు దెమ్మని మరెగుపరచియు
పరమపూర్ణ సమాధిజెందితి వెందుకూ, నమ్మినందుకూ
2. కోపమా, నాతొలిపాపమా, నీ పదాంబుజసేవకుడ, న
న్నేపగిది దయజూచి బ్రోతువో, దేవరా, వరదసుధవరా!
3 నాదమా నాయెడ, భేదమా, వాదభేదాతీత భక్తా
మోదనిత్యానంద వైభవ, భూజమా, ఘనసామ్రాజ్యమా !
4 పన్నగభూషా, తిన్నగా, కన్నతండ్రివటంచు మదిలో
నిన్నెనమ్మినుతించ నాతో, పల్కవా, కరుణనుజిల్కవా!
5 నిరతమా, మదిసం, భరితమా, వరమహాశయ పోతులూరి
వంశజలనిధిసోమ నేనీ వాడనూ, పరులను వేడనూ-

6 భారమా, నాదగునేరమా, నూరిజనమందార శివ ఓం
కారమంత్రాధారినిత్యని, రంజనా, పాపవిభంజనా !
7 కోరితి నిన్నే జేరితీ ధారుణిక్ కడియూల శ్రీ నీ
పూరియాఖ్యశరణ్య ! సద్గురురాగదే మోక్షి మీాగదే?
8 భక్తిచే కడునాసక్తిచే శక్తిముక్తు లొసంగు నిన్నను
రక్తిపూజ లొనర్చు నన్నిక, జూడవా నిర్దయ వీడవా—

స్తోత్ర ప్రణాళిక – పున్నాగరాగం – చాపు

1 శ్రీ మహేశ్వరా నమాస్తుతే, మాంపాహి యా
శ్రితజనావనా ! నమోస్తుతే—
ధీమసమున నన్ను బ్రోవ, దిక్కునీవని నమ్మియుంటిని
స్వామినాయెడ కరుణరాదె శాంతదయాకర సుధీర ॥శ్రీ
తేవారం। దేవ దేవేశ యీాశా! జగదీశ! దివ్యరూప ప్రకాశా
నమ్మియున్నాడసామీా! నాయందు, కరుణలేదయ్య దేమీా
వేదవేదాంత వేద్యా! తత్వార్థ, విజయ భవభోగ వైద్యా
శ్రీ విరాట్పోతులూరి వీరేశ చిత్కళాకార శౌరీ—
పంచచామరం రక్షరక్షపాహిమాం సురక్షితాఖిలా శ్రితా
లక్షితాష్టసిద్ధిమత్కళా విలాసభాసురా
అక్షయాగ మూర్ధవన్న హృదయార్ద్ర మ్మానసా
శిక్షితారిస చయా! విశిష్టయోగకౌశలా
ఓంసద్గురు వీరనారాయణం భజే ..
2 భూరిసత్కృపాపయోనిధీ? వందనము పంచ
భూతనిగ్రహా! శుభాకృతె
హారహారభక్తమం, దారతారకా సుకీర్తి
పారసద్విచారకూ, పారసత్సుధాకరా
తేవారం। భానుకోటి ప్రకాశా, భాసురోల్లాన సయీాశా
నిన్ను ప్రార్థింపుచుంటి నన్నేలు కొమ్మనంటి
నాతండ్రి నిన్ను నమ్మి, నాడ నన్నేలుకొమ్మా
శ్రీ పోతులూరి రాయ చిద్రూపబుధని కాయా

పంచచామరం। పరాత్పరాంశచే సమస్త భక్తులర్చది సేయగా
మొరాలకించి సంతతంబు మోక్షమిచ్చు వాడవౌ
విరాట్ స్వరూప పోతులూరి వీర దేశికోత్తమా
నిరామయ ప్రభాప్రధాన నిన్ను నమ్మితిన్ గదా!
ఓంనమశ్శ్రీ పోతులూరి వీరబ్రహ్మణే

3 భక్తజన సుఖ ప్రదాయకా, అష్టాంగ యోగ
భద్రముద్ర సంవిధాయకా
రక్తిమీర మిమ్మునే నిరతంబు పూజసేయ
వ్యక్తిగలుగునంచు నమ్మితయ్య భూజనత్నుతా ॥శ్రీ

తేవారం। నిర్మల జ్ఞాన రూపా నిర్గుణోద్యత్కలాపా
కర్మసాక్షి స్వభావా, కరుణించు దేవ దేవా
పరమాత్మ, భవనాశా భవ్యనంగ్రహ నివేశా
పోతులూర్వీర గురుడా! భూతేశ పాపహరుడా
పంచచామరం! నిరంతరాగమ ప్రబోధ నిర్వికార మోహనా
కరంబు నీ మహా ప్రభావగానముం బొనర్పుచున్
పురందరాది నిర్జరౌఘ పూజితాంఘ్రి పంకజా
నిరంతరంబు నా యెడందనిన్ దలంతు సద్గురూ!
ఓంకారమంత్ర నిలయా యనమగ

4 ఘోరపాప నిశిదివాకరా, ఓంకారమంత్ర
పూరితా । సదా శుభాకరా
ఘోరకర్మలపాటవీకుఠార నైగమ ప్రచార
చారు లింగమల్లపుర విశాంత భవ్యధీవరా ॥శ్రీ॥

తేవారం। అనుపమానంద భరితా, ఆదరింపంగ లేవా
దిక్కునీవయ్య నాకు, మ్రొక్కితిని వేగనీకు
నన్నేలు చిద్విలాసా, నారాయణాంశభాసా
అనుకంపజూడ వేదా, అఖిలాగమ ప్రచారా
పంచచామరం। చండ తాండవ ప్రచండ మండితాధినాయకా

ఖండరూప, కోటిభానుమండల ప్రదీపకా
జాండకోటినాయకాయ ఖండసౌఖ్యదాయకా
అండబాయజాల నన్ను దండినాదరింపవే।
ఓం ఆదిమధ్యాంత రహితా యనమః

తే। గీ। ఈ విధంబున సిద్ధుడు హెచ్చుమీరి
ప్రాణవాయువులా పరబ్రహ్మమునకు
తగ సమర్పణసేయంగ దలచి. కథన
చర్య లోనరింప నంత నాశ్చర్య మొదవ

వ। శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర ప్రసన్నమూర్తి వారిమందానంద
తు దిల హృదయార వింద్రులై ప్రాణాయామముపట్ల నిర్వ్రద్ధమున
సిద్ధునకి జప్యాహారంబునదర్సనంబిచ్చిన, మహానందభరితుండయి
సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి, లేచి

తే।గీ। సిద్ధుడనైతి పరిపూర్ణ సిద్ధుడగుచు
గలిగె నేటికి భవదనుగ్రహసమృద్ధి
తెలివి నా యాత్మయందు సందియము లుడిగె
తనుగుణంబున నొక కోర్కెదపలె నిపుడు

వ. అని యానంద పారవశ్యంబున నంతర్లక్ష్య లక్షితుండయి

తత్వం - సుద్ధసావేరి - ఆదితాళం

నే జూచినానే, బ్రహ్మము నాలో, నే జూచినానే
నేజూచినా నోర! నిజముగ తారక
రాజయోగము నందు, రంజిల్లు నా గురుని ॥నేజూచి॥

1. కన్నుల నడుమను నన్నపుదిక్కులో
తిన్నగ వెలిగేటి పున్నమచంద్రుని ॥నేజూచి॥

2. ఫాలభాగమునందు నీలజ్యోతుల నడుమ
నోలలాడుచునున్న శ్రీలింగమూర్తిని ॥నేజూచి॥

3. చూపులలోపల పాపల నడుమను
వ్యాపించి వెలిగేటి యాపరంజ్యోతిని ॥నేజూచి॥

4. చక్షుగ ప్రియంగా సాక్షాత్కరింపుచు
నిక్షేపమై వెల్గు సాక్షిభూతుని నాలో ॥నేజూచి॥

5. చందమామకు నడుమ సుందరాకృతితో నా
నందముగను వెలుగు హరి పోతులూరీశు ॥నే

వ. ఇట్లానంద తాండవంబొనర్చు సిద్ధుని యెదుట సాక్షాత్కరించిన శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవా రభయ హస్తంబున నాతిని దీవించుచు నిట్లనియె—

కాలజ్ఞానం - ద్విపద

ద్వి॥ వినర సిద్ధయ్య నీవేడిన యట్టి వినయ వాక్యములకు వేడుకలొంద వెబన్నా నా బన గాసినట్లో మున్ను—వీరభద్రుని కృపావీక్షణంబునను కారణంబునుబొంది ఘనత చెన్నొంది—ఘనత కాలజ్ఞాన గ్రంధంబొనర్చి అనువొందగా మున్ను నా గరిమ రెడ్డి - వారింట దాచిన వార్తలు నిజము—కారణ కార్యముల్ కలియుగంబునను—ధర్మంబు దప్పి యధర్మంబు హెచ్చి - కర్మ సంకల్ప వికల్పంబు లమర - దానికై యుత్పాత తతులెల్లగల్గి యూహూర నొకశక్తి యుద్భవింపుచును ధారుణిభారంబు తగదీర్చగలుగు - అదిగాక యింద్ర కీలాద్రి దుర్గంబ—కెదురుగా కలహంబు లేర్పాటులగును అచట నవాబుకు నతిరమ్యమయిన—ప్రచురమౌ కోట సంభ్రమలీల నమరు రూంపాదుమావచ్చి రూఢిగా కదన - కారులౌ సమబల కంఫిణీ దొరలు మందుగుండు సమేత మరఫిరంగీలు—సందడి గజవాజి సంఘంబు నడప - రణగుణ ధ్వనులచే రాజ్యమంతయును—వణకుచు రక్తప్రవాహంబుచూచి—భీతావహపడి నరుల్ బెదరి మూర్ఛిల్ల - అతీరుగా కొంత హతము నొందెదరు - విలసిల్లి యాకృష్ణవేణి యుప్పొంగి గంగాతరంగ సంగత మహోత్తుంగ - భంగంబులై నింగి భాగంబు ముట్టి—తరిమిడి ఘోరయుద్ధమును గావింప— నననశనంబుల డిన నానాగ్రహములు - ఘోరపిశాచముల్ ఘూర్ణిల్లుచుండి - యీరీతిగా యున్న గేంద్రంబు చెంత - ధరణీ

పతులు కొంత ధరణిపై గూల ఘనుడయిన వీరభోగ వసంతరాయు
లనురాజు ధారుణీ కధిపుడైవచ్చి - కృతయుగధర్మంబుగోరి వర్ధిల్ల
హిత వొప్పగా రాజ్యమేలంగ గలడు - మనువంశమున కెల్ల
మాన్యత్వ మొదవ- జనులెల్ల సకలపూజలుసేయ విశ్వ - కర్మ
ప్రవర్తనల్ క్రమముగా వెలయ - భక్తులనెల్లను పాలించువాడు
భక్తి మద్గురు వీరభద్రునియాన - తప్పదీ వాక్యముల్ ధరనెన్న
సిద్ధ - యొప్పుగా గ్రహియింపు మర్వీ స్థలమున.

సీ। ఓరి సిద్ధప్ప ! నీ వొప్పుగా నమ్మిన
శిష్యుండ వగుటచే చెప్పియున్న
హితముల నెఱిగింతు నిలలోన గురుసేవ
సేయనివారల జేరరాదు
గురుశిష్య మటంచు కుమతులై, దుర్వాద
ములు సేయు వారల గలియరాదు
దారాసుతాదుల శారంగబోలియు
యోగుల మనువారి నొల్లరాదు
గాన లోకానుచారంబుగా మెలంగి
యెరుక మరపుల రెంటి గుర్తెరిగి రాజ
యోగలక్షణ లక్ష్యంబు బాగుమీఱ
గనుము, వైవాహికము జేసికొనుము మనుము

ఆ। వె। నీదు కోర్కెలెల్ల నిక్కంబుగా,బోధ
పడియె, నోరి శిష్య పాదుకలను
ఘనముగాను మా శిఖాముద్రికయు దండ
మిపుడు గొనుము పూజలెపుడు సేయ।

వ। అని యంత ర్హితుండయినంత, బుద్ధివిశాలుండయిన సిద్ధుడు గురు
కటాక్ష వీక్షణంబునన్ జేసి ధన్యుండై నేటికి కృతార్థుడ నైతిని
అనిగురుపాదుకా, దండ, శిఖాముద్రికల నందుకొని సద్గురుండగు
వీరబ్రహ్మంగారి యాజ్ఞకు బద్ధుండయి యథాస్థానంబునకు బోవుచు

సీ॥ శ్రీ గురు పోతులూరీశ్వర గురుండు, మా
తండ్రి గోవిందాంబ తల్లిగారు
ఆర్తశరణ్యుండు అన్నగావలె మాకు
గోవిందయాచార్య కోవిదుండు
అతి దయాపరుడు చిన్నన్న పండితపోతు
లూరయాచార్య విస్తార కీర్తి
ఆది పరంజ్యోతి యా యీశ్వరాంబ లో
కేశ్వరి మాకిదే యిష్టసిద్ధి
జన్మసంచిత మీడేరె జయము గలిగె
నను మ ముడుమాల కతివేగ నరుగుదెంచి
పాదుకలును ముద్రికయు నమాదరమున
పూజసేయుచు నుండె నెప్పుడు గృహమున

జై శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారికి జై

మంగళం మహాత్

ఓంతత్సత్

మంగళ హారతి

జయమంగళం సదా శుభమంగళం
జయాజయమంగళం నిత్య శుభమంగళం

1. మంగళం భవునకు మహిమోన్న తాంగునకు
మంగళం సదయాంతరంగునకునూ
అంగజాహితునకును శృంగార చరితున క
భంగునకు శ్రీ వీరబ్రహ్మమునకూ జయమంగళం।

2. మందగమనమున నానంద మింపొందగా
సందియంబులు శాంభవికినీ
సుందరవదనల కెల్ల కోర్కె లీడేర్చేటి
యింపువదమైన గోవిందమ్మకూ జయమంగళం।

3. మందరోద్ధీరునకు సుందరాకారునకు
వందితాఖిల భక్తబృందునకునూ
బిందునాద కళాంత రేందు మండలమధ్య
మందు నింపొందు గోవిందయ్యకూ జయమంగళం।

4. వీరునకు శాస్త్రగంభీరునకు భువనాది
కారునకు నాటకా ధారునకునూ
భూరి వీరాశయోదారునకు, హారునకు
ధీరుడౌ శ్రీ పోతులూరి హరికీ జయమంగళం।

5. నాదస్వరూపిణికి, వేదవిజభామణికి
సాదరాన్వేషణికి, జగదంబకూ
వాదభేదములన్ని పోద్రోలి సజ్జనుల
నాదరించెడి యీశ్వరికిమ్మపుడూ ॥జయమంగళం॥

6. ప్రణవాక్షరికి ఝుణం ఝుణ రవోత్కట సుకం
కణ పాణికిని నీలఘనవేణికి
గణనీయ బెజవాడ కనకదుర్గాంబకును
అణిమాది వరద యక్షీణఘృణికి ॥జయమంగళం॥

గ్రంధ రచనా కాలము

సీ। పరిమి వీరాచార్యు లరుదుగా శ్రీవీర
గురుకటాక్షం బాత్మ గోరి ధాత్రి
పుణ్యగాధలచేత ప్రొద్దులు పుచ్చుచు
విఖ్యాతి మీరంగ విక్రుతినామ
సంవత్సరమున, పుష్యసిత త్రయోదశి
గురు వాసరంబున కోర్కెమీర
మేటి వీరబ్రహ్మ నాటకాలంకార
సాహిత్య మొనరింప, సత్కవీ ంద్రు
లైన వీపూరయాచార్యు నాశ్రయించి
పూర్తిచేయించె నీరోజు బుధులు నాత్మ

సంతసమునొంద, సత్కీర్తి వంతుడగుచు
పరము నార్జించె, సామ్రాజ్య పదవిగాంచె

శ్రీ

—గ్రంథావతార కథనము—

ద్విపద। శ్రీ కర బ్రహ్మాండ సృష్టి కారణుడు – సాకారభావుడుజ్జ్వల
దీపకుఁడు – కారణాతీతు డోంకార గమ్యుండు – మేరు భూగోళ
నిర్మిత సుధీరుండు – మూర్తిత్ర యైక సంపూజ్యుండు లోక
కర్తయా శ్రీ విశ్వకర్మ కులాబ్ధి – చంద్రుండు ఘనతరాచారుండు
సుగుణ – సాంద్రుడౌ ఘనుడు కాశ్యప గోత్రభవుడు – పరిమి
వంశాబ్ధి శుభాకరమూర్తి గురులింకయాచార్య వరధర్మపత్ని
సుబ్బమాంబికయందు సుతు డుద్భవించె – దబ్బరలేని యుత్త
మగుణాన్వితుడు – రాజార్థధరుని వరప్రసాదుండు – భూజన
వినుతుండు పూతవర్తనుడు – అనఘాత్ముడయిన వీరాచార్యు
డొక్క – దినమున నిట్లు బుద్ధిని యూహజేసె – జగతి వీర
బ్రహ్మ చరితంబుజూడ – నిగమాంతనిధి యద్దినిఖిలవేద్యముగ
భువిలోన నాటకంబుగ నున్న మేలు – భవరోగహరమని భక్తి
యుక్తుడయి – చని వేడ్కచే కొండశంకరకవికి – మనవిచేసిన
గొంతమట్టుకు – వారి వలన నేర్పడె నది భక్తి లేకున్న – దల
పోసి, కాలంబు దాటిపోవుటకు – మనసులో గుంది బ్రహ్మము
నాత్మనెంచి – మనుజుని దీక్షకు మారుండనుచు – సంతసం
బుగను నాసంగతి కొంత – తలపురా నటకుండ తరలివిన్
కొండ – సీమను పొట్లూరు చేరి నాతోడ – క్షేమసంగతులెల్ల
జెప్పి యీ చరిత – పూర్తి చేయుమటన్న పూని యాచార్య –
మూర్తి సత్కృప నిది ముదముతో జేయ – జాలితి నాదువంశ
విధంబు సిరుల – గ్రాలు శ్రీ మద్విశ్వకర్మాన్వయుండు – పస
మీరు కాశ్యప ప్రథితగోత్రుండు – వసుమతి కడియాల వంశ
వర్ధనుడు మల్లయాచార్యుండు మహితసత్కీర్తినెల్ల సంపదలచె

నెలమి జీవించు - నతనికి పత్ని మహాలక్ష్మి యనగ - వ్రతు లయిన యీ వధూవరులకు సుతుడ - శ్రీపరమేశ్వర సేవాభిర తిని- నేపారు బుధవర్గ హితుడ, నీపూరి - యాచార్యుడను సంస్కృతాంధ్ర కవిత్వ శూచన దెలిసి నే సుజనాళి మెచ్చ- పరహిత చరితంబు భక్తిరసంబు - పరమపవిత్రంబు పాపక్ష యంబు నదమలంబని - యీ రచన జేసినాడ - నిది విన్న వ్రాసిన నిష్టభోగములు - చదివిన సుజ్ఞాన సంపత్కరంబు - సదయాత్ములకు నెల్ల సరిలేని భోగ - భాగ్య సంపదలను బహు ళత సేర్చి యోగ్యత పరతత్వ యోగంబు గూర్చు।

కందార్థము

శ్రీ వీర బ్రహ్మ చరణ
సేవిత మానసుడనగుచు జెప్పితి దీనిన్
ధీవరులు దోసగు నెన్నక
భావములో మెచ్చుకొనుడు, పండితులారా
జీవేశ్వరా ఖండజ్ఞులారా!
కేవల భక్తినత్క్రియతో లిఖంచిన
దేవదేవుండిచ్చు దివ్య వరంబులు, ధీమంతులారా!

## కాలజ్ఞానము - తత్వము

1. చెప్పలేదంటనక పొయ్యేరు - నరులారగురుని- చేరి మ్రొక్కితె బ్రతుక నేర్చేరు - చెప్పలేదనుకొందురేమో -తప్పదిదుగోగురుని వాక్యము - తప్పు త్రోవల బోవువారల చప్పరించి మ్రింగు శక్తులు ।చెప్ప।

2. మొప్పితనమున మోసపొయ్యేరు యిదిగాకకొందరుగొప్పతనమున గోసుమీరేరు- యిప్పుడప్పుడనగరాక- యెప్పుడో యే వేళనో మరి- గుప్పున గుప్పున దాటిపోయ్యే గుర్రపడుగులు యేసు పడును. ।చెప్ప।

3. తాకుతప్పులుదలచకున్నారు- తారాకణమ్మెనివివేకమూతో దెలి యనేర్చేరు - జోకతోడుత తల్లిపిల్లలు- జోడుబాసి అడవులందు

కాకిశోకము జేసి ప్రజలు-కాయకసరులు నమిలిచత్తురు ।చెప్ప।

4. కేక వేసి ప్రాణమిడచేరు - రాకాసిమూకలు - కాకబట్టి కలువరించేరు-ఆకసంబది యత్రనవును-ఆరు మతములు వక్కటవును-లోకమందుజనులు అందరు-నీరు అగ్నిలోమునిగిపోదురు ।చెప్ప।

5. అగలు-విడిచిపోగలు దాటేరు- యిదిగాకపట్ట - పగలుచుక్కలు జూచి భ్రమశేరు-భుగులుభుగులుధ్వనులుమింటను - పుట్టిపోయిన పిమ్మటను - దిగులుపడుచు ప్రజలు చాల దిక్కులేని పక్షులా దురు ।చెప్ప।

6. పాతకూలుపదటగలసేరు-పుణ్యాత్ములైన సాధకులు సంతసించేరు-భూమిమీదధూములు పుట్టిపోయినపిమ్మటను - రామరామ అనిన వారలు రాలిపోదురు తెలిసికోండీ ।చెప్ప।

7. యేమొపమొ యెరుగకున్నారు - యెందెందు జూచిన యముని పురి కేనడువమందూరు - భూతలమున నిట్టివింతలు, పుట్టి అణగిన పిమ్మటను - నీతికృతయుగ ధర్మమప్పుడు - నిజము నిలకడ మీద దెలియును ।చెప్ప।

8. ముందు వెనుకను గానకున్నారు-మూర్ఖులై భువిలో ముందుగతియు గానకున్నారు-కందువాతో పిన్న పెద్దలు కన్ను గానక గర్వము లచేమందెమేలములాడు వారిని-బందుబందుగ గోతురక్కడ।చెప్ప

9. కీడుయేదియు గూడదందూరు-వనగూడినప్పుడు, యేడజూచినవాడు కొందూరు వేడుకతో పోతులూరి వీరిభోగవసంతరాయలు యేడు దీవులు యేకచక్రము యేలును బ్రహ్మాండమంతయు ।చెప్ప।

## తత్వము

1. కారణమొక్కటి దెలిపెదవినుడి ఘనబుధజనసంఘములారా- దారుణిలోనిదిజరుగుయ మోఘము - ధర్మగుణోన్నతపరులారా - అయిదు వేలసంవత్సరములపై మహాపదలుగలుగునుసమలకునూ ।కారణ

2. కలియుగమునగల కర్మలెల్లను - హరియించును తప్పక వినుడి-స్థిరముగ మముపూజించినవారికి-శిరిగల్గునునిజమదిగనుడి కారణ।

3. వన్నెలతుగుర్రములునడువగను – ననుమతి తలక్రిందౌ నిజమూ–
పన్నుగగజముల బాలుకలత్రొక్కి–డిపట్టిగ్రమ్ముభూరజమూ కారణ।
4. నమ్మడికృష్ణానదితీరంబున – నరకులాటవిజమాచూడు – క్రమ్మిన
బలములుకత్తులపాలౌ – గాంచిపిల్వ నొక్కడు లేడు ।కారణ।
5. ఏడుపుట్లనల్లలు వక ఘడియలో – యిలపై దాలునుతప్పకనూ–
కోడెగాండ్రు రణభూమిలోపల కూలెదరెవరికిజెప్పకనూ కారణ।
6. వరపుణ్యులుద్భసద్భక్తులునీచులవలన కష్టములనొందెదరు–స్థిరము
గవారల కోపాసమున – అరుదుగ భస్మంబయ్యెదరు ।కారణ।
7. సరసత సద్గురు–వీరభద్రుపద–సారసముల నెంచితివి– అరుదుగ
వీరబ్రహ్మాహ్వాయమున అవని సమాధిని జెందెదనూ ।కారణ।

ఓం తత్సత్

ఓమ్

# శ్రీ కాలజ్ఞానము గోవిందవాక్యములు

శివగోవింద గోవింద – హరిగోవింద గోవింద

1. గోవిందుడనగాను భావించిచూచితే – ఆనందబ్రహ్మమందాడగనూ
ఏమందు నేనింక ఛాముండిముంనార–ఆనందముగసిందాడితిరా॥శి।హ
2. మేషరాశిలో శనీ ప్రవేశమయితేను – మేలుకొందరికి అయ్యానిమ
దోషకారులెల్లధూళులియిపొయ్యేరు ధూమ కేతువుమింట
బుట్టినిమా
3. యిమ్మహిలో బహుధాన్యవత్సరమంద– నేక వుత్పాతాలుగల్గినిమ
యెమ్మెకర్మాలకుచింతలుబుట్టీని దుర్మదించిననరులు సమసేరుమా
4. కల్లలాడెవార్ని నిద్రుగానుగలలో–మళ్ళించి పొర్లించి కూల్చేరుమ
తొల్లి ఛండిక దేవి శనివద్దజేరించి–కల్లయుగమున వింతగలిగీనిమా
5. ముసుపు వెంకటప్ప వుత్సాహమయ్యాని ముసుపులు తిరుమలకు
నడచీనిమా
కడపవద్దయున్న కమలాపురమ్ములో–కప్ప కోడికూతగూసీనిమా
6. జాతిజాతికి చాలవైరముల్ గలిగీని–జః యోగము తల్లడిల్లీనిమ

పెన్న యొద్దునయున్న చెన్నూరు గ్రామము - వరదల పాలయి
పోయ్యానిమా

7. ఈశాన్యమునుండి విషఘాలివచ్చీని విపరీతనరులంతజచ్చేరుమ
పలుకిరాతకుల ఖండించివేయగా కలికావతారుడు వచ్చీనిమా

8. పొగరుబోతులంత భవిష్యమంతయు-బూటకమనిపల్కు చుండే
రుమ కాగలకార్యముల్ కనురెప్పపాటులో-జాగులేక వేగజరి
గేనుమా

9. భారతభూమిని పరిపాలనజేయ-పరదేశవాసులు వచ్చేరుమ
అరువది వత్సరంబులు యెకరీతిగా - అంబయొక్క తె
అవనిపలేనుమా

10 విశ్వంబులో విశ్వనాధావధూత యను-విశ్వబ్రాహ్మణు డొక్కడు
బుట్టేనుమా

విశ్వంబులో తాను శాశ్వతంబుగనుండె విశ్వనాధుడనినపల్కేనుమ

11 భూతలంబున రేపల్లెమాలయందు-ఈతచెట్టుకుపూజల్ చేసేరుమ
ధాతపార్థివమధ్య దేశాధిపతులెల్లపాతకంబగుయుద్ధముల్ జేసేరుమ

12 ఉల్లిగడ్డలకు ఉపదేశమిచ్చేటి - కల్లగురువులు కలిలో వుండేరుమ
కల్ల గురువుల నెల్ల కాలదన్నును యముడు కల్లలేని వార్ని
గాచేనుమా

13 అయిదు వేల నాల్గువత్సరంబునను అవనీంద్రుడు అస్తమించేనుమా
అయిదు వేల ముప్పదారింట మీాదట అమితముగ యుద్ధముల్
జరిగేనుమా

14 బాగుగ ఆనందవత్సరంబునను నాగుమల్లె నశియించేనుమా
నాగుమల్లెరీతి నరులంత జచ్చేటియోగంబు ముందిక వచ్చేనుమా

15 బహుధాన్య విక్రమ వత్సరంబులలోన బహుగ యుద్ధములు
జరిగేనుమా

రాహుకేతులవలె రారాజులిద్దరురణరంగమున కాలుదువ్వేరుమా

16 అయిదు వేలమీాద నన్ని రాజ్యములలో అమిత కష్టము
లనుభవించేరుమా

భావ యువల మధ్యపరరాష్ట్రములలోను బహు ప్రళయములు
కల్గియుండేనుమా

17 ఉత్తర దేశమున వైశ్యకులమునందు ఉత్తమగంధోకడు బుట్టెనుమా
హత్తుగ నన్ని దేశంబుల వారంత సత్తుగపూజలు జేసేరుమా

18 లోకమంతయును ఏకంబుగాజేసి ఏకుబ్బట్టివాడు వచ్చేనుమా
ప్రాకటంబుగను లోకంబులో తాను మేకై నిలిచి జనుల మే
లెంచేనుమా

19 కోయరాజ్యంబంత గొడవలపాలౌను కోయనాయకుడతికోపం
బుతో కువలయపతికి బల్ కష్టముల్ గల్గించి అవనిలో అదృశ్యు
డయ్యానిమా

20 ఐదువేలమీదబహుధాన్యలోపలఅన్ని జాతులువకటయ్యామా
అవనిలోగల బీద ధనవంతు లొకటిగా అయ్యె యోగంగూడ
వచ్చేనుమా

21 పల్నాటిసీమకు బాటసారొకడొచ్చి పల్నాటిద్రవ్యంబుదోసేనుమ
పల్నాటిసరులంత వచ్చియాకంతయు మేకరీతిని బాగ మేసేరుమా

22 అయిదువేల పదిరొంటిగో నొక్క అవనీంద్రుదుదివి కేగేనుమా
సైదాపేటలోన సాహెబులందరు సమరంబునందున సమసేరుమా

23 అద్దంకిసీమలో బీదయాదవుని ట బుద్ధునంతటివాడు బుట్టెనుమా
యిద్దర జనుల కనేక భవిష్యత్తులు అయిదేండ్ల ప్రాయమున
దెల్పేనుమా

24 దాసులు యోగులు ధరలోనదాగేరు మోసదాసుల్ యోగుల్
మించేరుమా
మీసాలు లేవో డీదేశానికొచ్చేను మహింకొండలకు జండాలే
సేనుమా ॥శ్రీ॥ హ

25 దనుజనామ సంవత్సరమందున వాంతిభేదులచేత వాలేరుమ
హూణముఖులవంశమున కొంతబోయ్యాని కాలిజాగసిభూమి
బొలిచేరుమా

26 ప్రభవ పార్థివమధ్య పరదేశములన్ని బహుప్రళయంబులు గల్గి యుండేనుమ।
ప్రభు వీరవసంత రాయలొచ్చెడి లోగ ప్రళయము లన్నియు పండేనుమా

27 తల్లుల బిడ్డల తగవులు నడచీని తల్లడించెదినము లొచ్చెనుమ
కల్లగాదీమాట యుల్లముసాక్షిగ గద్దనొడచికాకి తన్నీనుమా

28 బాపలకు పీటలు మాలలకు మంచాలు మహిలోవేసే దినము లొచ్చేనుమా
మధుర తంజావూరు మరిహరణ మయ్యేను మహానంది శిఖరము విరిగేనుమా

29 హంపీవీరూపాక్షి రెడ్డూళ్ళనడమను అగ్నివర్షములు గురిసెనుమ
పెంపుతో పదునాల్గుగ్రామాలు మండిభుగివణకి గ్రామంబులద రేనుమా

30 నాల్గువేల యెనమన్నూటముప్పదిపండ్లు కలియుగాబ్దులుజరిగే నుమా కలియందు శ్వేతముఖులు దొరలయ్యేరు మెలుకువతో రాజ్యంబు లేలేరుమ

31 శ్వేతముఖుల ధూమశకటముల్ గల్పించి భూతలంబు ననిను పకమ్మూలపై సూత్రమెరిగి పశ్చిమోత్తరాదిశలందు ఘాత్రముగా నడిపించేరుమా

32 ఆయలోహతామ్రదారుశకటములపై అన్ని జాతులొకపైఅందు లోను స్వయకులాచారముల్ దప్పి యొకరిపైన యొకరు బడియూ ళ్ళకురికేరుమ

33 ఐదువేలముప్ప దెనిమిదింటిలో రాజు అవనివిడచీ దివికేగేనుమ
ఆయురారోగ్య ఐశ్వర్యములు క్షీణమయ్యె యోగము జనుల కొచ్చేనుమా

34 మబ్బుగూములబడి దబ్బరలాడేరు మబ్బునడతలు బహునడచేరుమ
గొబ్బుననా రెల్ల నాశనమయ్యేరు గుణవంతులీభువిలో నిలిచేరుమా

35 ఫణుకోట్లభూమండలములోను పొల్లుబోయిఘుట్టినిలచేనుమ ఏడూళ్ళ

కోక యూకు ఏకాంతమయ్యాని ఏకాంగులుఅరుదయ్యేరుమా
36 ముండమోపులెల్లముత్తైమలయ్యేరుముందొచ్చేగతిమీరు దెలసె
నుమ బండాటలాడేటి పాపిష్టినరులంత పండాకురీతిగా రాలేరుమా
37 కుంభకోణమునందుగోవధజేసేరు కొల్లాపురము కొల్ల కొట్టేరుమ
కంభము
చెరువులో కలపొన్న బూచేను కందుకూర్లో చెరలు బెట్టేరుమా
38 ఆదవేణిలోను కప్పకోడికూత అందరు వినగను గూసేనుమ
మేదినిమీదను తాడిపత్రిలోను మేక మనిషియూపమయ్యేనుమ। శ।హ
39 మైసూరునందుండిమారెమ్మవచ్చేను మాయవాదులబహుమింగే
నుమ దాస్యనరులకు తాపత్రియము లేక తప్పక గురుసేవ జేసేరుమ
40 వానివరుస లేకపొయ్యానిజగములో వసుధలోపంటలు ఎండేనుమ
శ్రీయుతునిమతము సమకూర్చివచ్చేను సత్యవాదులుకొందరుండే
నుమ
41 కందనూరులోను స్త్రీ పురుషుడయ్యేను కలకోడితర్వాత గూసేనుమ
సందేహము లేదు సామగానము చెవుల సకలమయినవారువినిరుమ
42 ఉత్తరాదిప్రజలుదక్షిణముఖులయ్యుఉత్తరాయణమందువచ్చేరుమ
కత్తికత్తిపరచి ఘనయుద్ధమయ్యేను కలిలోభూదేవియు వణకేనుమ
43 ఉత్తరదేశమున సత్తుగ ప్రజలంత కత్తులతో వేట లాడేరుమ
ఉత్తమాటలుగావు నదినదములుపొంగి ఊళ్ళన్ని గొట్టుకపొయ్యే
నుమ
44 కాలమొచ్చినదనుక నామాటలు కల్లలానిజనులు గూసేరుమ
కాలము మొదలా పాథానికొచ్చేను కల్లలెల్ల నిజములయ్యేనుమా
45 శత్రుసంహారుల వెంటబెట్టుకొని శేషాద్రివాసుడు వచ్చేనుమ
గురువుదైవము రెండు లేదన్నవారినిగ్రుచ్చి ఈటెమొనల గ్రుచ్చే
రుమ
46 హంపిలోవుండేటి హనుమతురాయుడు అరచివీధుల కేక వేసే
నుమ ఆ కేకతగ్గట్టె మహానందిమూలంగా ఇసుక రాలినట్లు రాలేనుమా
47 ఆకాశవీధిలో రాకాశిపంపులు కేకలు వేయుచును ధుమ్ముకోనుమ

చీకాకుపడియంత జనులెల్లజచ్చేరు శమనునీ దూతలువచ్చేరుమా
48 అప్పూలవారికి తిప్పాలువచ్చేను నిప్పూల వర్షము గురిసేనుమ
అప్పు జేసినవారి తలద్రుంచి వేసేరు ధర్మాత్ముల‌ను గారవించేరుమా
49 శార్గవవత్సర భాద్రపదమునందు భక్తకోటినిబిల్వ నంపేరుమ
దుర్గాకన్నీట తోరణాలుగట్టి దుర్జనులనుదునిమి వేసేరుమా
50 రామధర్మజులు సృష్టిభారముదీర్ప శృంగారమూర్తులై వచ్చేరుమ
ఘోరదురితములణగి కుంభినిమీదను పుష్పవర్షములు గురిసెనుమ
51 నిరూపాక్షీమందు దుర్గమాట్లాడి వీరధర్మజుమాట జెప్పేనుమా
తిరువళ్ళూరు వీరరాఘువస్వామికి తిరుకళ్యాణము జేసేరుమ
52 నందిపల్లెలోన బసవన్న కడుపులో నాగుపేరిడికమ్మ లుండినిమ
మొదటియాకమ్మలో వార్తలెల్ల వినిమూర్చిల్లి జనులంతజచ్చేరుమ
ముత్తలూరువద్ద ముందుగగూర్చుండి ముగ్గురు ముచ్చటలాడేరుమ
గుత్తిమగ్గము జేరిగురుపూజకాలానకోటిద్రవ్యం దానమిచ్చేరుమ ॥శి హా
54 ఆనందగురువుల వెంటబెట్టుకొని అహూబిలానకు వచ్చేరుమ
ఆనందగురువుల అనుమతిచేతను అన్నవస్త్రములు ఇచ్చేరుమ
55 కంచిలో వుత్పాతాలుబుట్టిని గరుడధ్వజముగదలించేరుమ
పంచముఖ బ్రహ్మ పారుపత్యము విడచి పరంజ్యోతీ ధ్యానమూ
జేసేనుమ
56 పర్వతాన వుత్పాతాలుబుట్టీని పార్వతీచిరునవ్వు నవ్వేనుమ
పర్వశ్రావణమాస కృష్ణాష్టమికి పంచాంగము లేక పొయ్యేనుమా
57 కురుకొండలోనున్న హనుమంతరాయుడుకోపముచేతను పెరిగీనిమ
ధరణికినాలుగు త్రాటిమ్రాకులపొడవునరులకంటికిగానుపించేనుమ
58 కేతవళ్ళూరిలో కూతలుబుట్టీనీ పాతకోట పటల మయేనుమ
ఆత్మకూరివారు అడవిపాలయ్యేరు మోతుకూరివారు మొరిగేరుమ
59 చెప్పన్ని దేశాల ప్రజలకు జ్యేష్టశుద్ధవిజయ శలవిచ్చేరుమ
అప్పుడీప్రజలెల్ల యమలోకంజేరి అంతకునిచేత నొచ్చేరుమ
60 బంగారుపువ్వుల తలపాగజుట్టుక పస్పుకోకలప్తె ని గట్టేరుమ
మంగళాగిరి భానుమండలవాసుడు మహిమీదప్రకాశమయ్యేనుమ
61 బదరికోటలోను ద్రవ్యముతీసేరు బెజవాడకు గొంచు బొయ్యేరుమ

బిజనూరుసీమంత బ్రాహ్మణులకిచ్చేరుబీదవారికిధనములిచ్చేరుమ
62 భాగలమర్రిలో ద్రవ్యముదీసేరు చాటపెయ్యల జెండాడేరుమ
సాగరంబులమధ్యస ప్తద్వీపములు సర్వోత్తముడువచ్చియేలేనుమ
63 మాలమ్మ అవ్వకులో మాణ్నాలువుండీని మునిమడుగుదోపిళ్ళు బోయ్యేనుమ
పాలవాయి ఖద్ద పణతులబట్టేరు వోరుగంటికిగొంచు బోయేరుమ
64 శంకరాచార్య శ్రీనివాసులవాక్యాలుశాశ్వతంబుగ నడువబోయ్యేను
శంకరునిసన్నిధిన విద్యారణ్యులవారి శాసనముసత్వముఅయ్యేను
65 రుద్రసీమ గోవ్రుండే రోదనమనుజులు రూపహీనులై పోయ్యేరుమ
రుద్రూడు కరుణాసముద్రుడు శ్రీవీరభద్రూడు భక్తులబ్రోచేనుమ
66 భువిలోనమానవులు దుష్కర్ములైరాలి దివిదేవేంద్రుడు బ్రహ్మ మునులునుమ
శ్రీవైకుంఠముజేరిశ్రీనివాసులగని అందరునతిభక్తిపొగడేరుమ ।శివ
67 స్వామికలియుగమునందు నీచులు ప్రబలయ్యు సాధుల బాధించు చుందురుమా
ఏమందు మన్యాయ కార్పణ్యములచేత కర్కోటకులయ్యు యున్నారుమ
68 మాలమాదిగలు భూపాలురగుటచేత నీలవర్ణ నీతుల్ నీతులయ్యు
మేలుకీడయి తారతమ్యము లేకను మత్తులై చరియించుచున్నారుమ
69 అట్టిమ్లేచ్ఛనీచులనునిర్వంశముజేయుపుట్టింపవలెపుణ్యపురుషునొకని
పుట్టించకుండిన భూలోకమునందు మట్టుమీరి జనులుమాల లయ్యేరుమ
70 ఆవాక్యములుఆదిభూతుడాలకించిదివిజేంద్రులనుజూచిఇట్లనియెను
ఓవిరించిలీలవసంతుడనై పుట్టి కావరాత్ముల నెల్ల ఖండింతునని తెల్పె
71 మీరుమీమీస్థానములకుజేరండి కొరత లేదిక నేను యుండంగను
హరి హరబ్రహ్మలస్వస్థానమునకు జేరమనునాజ్ఞ చెలువందనిచ్చేనుమ
72 జనియించు విధములు చెప్పశక్యముగాదు గనుక గురుకృపవల్ల జెలి శేనుమ

పనివడిపల్కెద పరమాత్మలీలలు పంచసహస్రంబుపై దెలిశేనుమ
యామానకొక చుక్కచొప్పునను నాల్గుయామాలచుక్కలుబుట్టేనుమ
యిమ్మహిలోనుండే పుణ్యులరక్షింప శ్రీమాన్ వీరయోగిబుట్టేనుమా

74 కేదారేశ్వరునికీర్తి విఖ్యాతమయ్యానికిరణామువిూదటఅయ్యేనుమ
నాదాంతర్యామినారాయణస్వామి నాడేయవతరించి వచ్చేనుమా

75 విర్భ దేశాధిపతి వేంకటాద్రి శ్రీ వీరయోగి వెంటవచ్చేనుమ
భూదేవిబల్కిని భూరాజుపుట్టుక భూములంతాస్వస్థ మయ్యేనుమా

76 విశ్వావిసులోన నుద్భావమయ్యాని కాశకులములోను బుట్టేనుమ
పాశుసంవత్సరంప్రాకృతమయ్యానిపశ్చిమదిశలందు ప్రబలేనుమా

77 మామామామామాయనిబిలచేనుఅల్లుడుమారేసుబుర్రలోవుండేనుమ
మామపేరుమార్గశిరశుద్ధచతుర్ధశి మంగళవారమని పాడేరుమా

78 వాసుదేవుడుపుట్టివర్ధిల్లుచుండియావసుంధభారముమాన్పవచ్చేనుమ
కాశ్మీరస్థలముల హరియునిజ్మంచియుకదలకఆర్నెల్లునిలచేనుమా

79 లోగానుమాగీని లోకాకుశెలను కాలజ్ఞానముజూడ దెలిసెనుమ
వాక్కునదైవము లేదన్న వారెల్ల ఆకురాలినట్లు రాలేరుమా

80 ప్రత్యక్షమైకొన్ని సంవత్సరంబులు సత్యంబుగా ప్రకాశించేరుమ
కూతగుయ్యనవోర్లు కోనేరుజగమెల్ల కుంపటిబెట్టినట్లయ్యేనుమా

81 ధనసుమిూదగురుడు ప్రదేశమైతేను ధనువుచేతహరుడుబుట్టేనుమ
మనసిజహరణుడు పాశుపతాస్త్రము మనవీరయోగికియిచ్చేనుమా

82 ఎనిమిదిముద్దులుతొమ్మిది కాళాలు యునికితోడను దిగునుదర్శనంబు
కత్తిబట్టేవాడు వీరవసంతుడు కర్మాలచెండాడ వచ్చేనుమా

83 కుంభమందుగురుడు ప్రవేశమైతేను కుంభినికుమరుగ యుండేనుమ
శంభువనుమతిచేత శంఖుచక్రధరుడుశాంభవిపట్నాన్ని ఏలేనుమా

84 బిరుదైన పెనుగొండమీదను ముందర భేరీధ్వనివిన వచ్చేనుమ
కరములుపదహారు గల్గినకామిని గండికోటమీద తిరిగేనుమా

85 పంచానకులములో ప్రఖ్యాతగయ్యేను పార్వతినేత్రములోడూ
తనూ పాశుపతాస్త్రము చేతబట్టుకొని పర్వతంబుమేర జేరేనుమా

86 భాగవతములోను శుకయోగిపల్కినభావికాలము దృష్టమయ్యే

నుమ మాఘబహుళ మందుమావారువచ్చేరుమహిమీదసంభ్రమము
లయ్యేనుమ

87 కన్యరాశిని శనిప్రవేశమైతేను కమలనాభుడుపయనమయ్యేనుమ
కనకాగిరివద్ద కలహంబులయ్యేను కాంభోజమును దేవిబుట్టెనుమా

88 హేమాద్రిరజితాద్రిదర్క-వాదమువల్ల రామధర్మజులు వచ్చేరుమ
హేమాద్రి హేమాలుగొలిచేరుముందర పేము బీటము మీద
జేరేరుమ

89 వినుకొండదుర్గమ్మ యిల్లుబయలు దేరి వీధులవెంబడి దిరిగేనుమ
సన్నజాజులవాన సాయంత్రమునందు శతమన్యుడు గురిపించేనుమా

90 ప్రేమతో వీరవసంతూరివెంబడి పెద్దలెల్లతల్లి వచ్చేరుమ సోమ
సిద్ధాంతము బొయ్యేరి జగములో శోభనములు ఆయ్యేనుమ

91 కుండలీశయనుడు ఘోటకము నెక్కి (శ్రీ)కూర్మగిరికేగ వచ్చేనుమ
కొండయ్య దాసుని శీఘ్రముగబంపి పెండ్లికొడుకుబిల్వనంపేరుమ

92 కూర్మగిరివద్ద గుడార్లువేయించి వీరుని పెండ్లచట జేసేరు
కూరగిరికి వేగ గంధర్వులువచ్చి నిర్మలగానము జేసేరుమ

93 కేశవుని పెండ్లి కీర్తిగజేసేరుమ ముత్యాలతలంబ్రాలు బోసేరుమ
కేశవునివశము దేశాలన్ని జేసి దేశాలవారికి వ్రాసేరుమ

94 ఈశ్వరవత్సర మాఘశుద్ధదశమి రోహిణి యిందు వారంబునా
సర్వేశ్వరునివశము దేశాలుజేసేరు దేశదేశములకు వ్రాసేరుమ

95 మకరకుంభములు మానాలలోపల ప్రకటనప్రకాశ మయ్యేనుమ
ప్రకటనజేసియు పలుమారు దెప్పినప్రజలు ప్రారబ్ధముం దెలియరుమ

96 ఉదయగిరితుదనుమర్రిచెట్టుక్రింద సుదతేడునిలుపులతో బుట్టునుమ
సాధుజనుల చూచిచూడగాబొయ్యేను భేదజనులబట్టి భ్రమింగేనుమ

97 హంపీవిరూపాక్షి రెండూళ్ళనడుమను అరచిబసవుడు రంకెవేసేను
విరూపాక్షివద్ద వీరంగవాద్యముమా రెమ్మగుళ్ళోను మ్రోగేనుమ

98 మూడుకోట్లము త్రైదువులంశాపము మూందరాపరిహార మయ్యేనుమ
మూడుకోట్లను త్రైదువులు పురుషుల ముకుందునివెంట వచ్చేరుమా

99 రేవతికన్యక వెంట మూడుకోట్ల దేవకన్యలు వేగ వచ్చేరుమ
దేవకన్యకలెల్ల దేవదుందుభులతో

భావికాలము గూర్చి పల్కెరుమా
100 ఓరుగంటిలోను ప్రతాపరుద్రుడు వీరుడై బహు క్రేక వేసేనుమ
ఆరాడిదగ్గట్టే ఆపార్స్వనరులెల్ల ఆకురాలినట్లు రాలేరుమ
101 శ్రీరంగపట్టణంచెన్న పట్టమునుండిశీఘ్రముగ బ్రాహ్మణులువచ్చే
రుమ వీరవసంతుని ప్రకాశ వింతలు వెంకటాద్రిహరితో బల్కేరుమ
102 అరిడాలుజెల్లులు పులితోలు గొడుగులుధరించిముందరనడిచేరుమ
మెరయుచూ వీరవసంతుడై వచ్చేను మొత్తించి కర్మల
మొరలాలకింపగా
103 అల్లుడు పేరయితె ఆదికేశవులు అవనిగర్భమందు వుండేనుమ
కల్లయుగము పశువత్సరంమందున ఘనుడుబయలుదేరి వచ్చేనుమ
104 నాలుగువేల తొంబన్నూటఏబదివత్సరంబులందు తెలిసేనుమ
వెలుగుచు భర్గునివత్సరమందున వీరయోగీంద్రుడొచ్చేనుమ
105 కల్లయుగము ఐదువేలేండ్లమీదట కలికిరూపుడుతరలివచ్చేనుమ
యెల్లలోకములు ఏలుచు చాతుర్యగములధర్మము నడిపేరుమ
106 తోకచుక్కలుబుట్టి దానివృత్తాంతము తూర్పుతల పశ్చిమ
దిక్కందునా
తోకశిరమ్ము బండికర్లంతడిచుక్క పైశాల్యంబు యుండేనుమ
107 ఇరువదిబారుల పొడవుతోకతోను నరులకండ్లకుగానుపించేనుమ
విరివిగా ముప్పదిమూడ్రోజులుండేను ఎరుగనిచోద్యాలుఎరిగేరుమ
108 గగనమందునాల్గు ఎదురుగాచుక్కలు ప్రకాశతారలుబుట్టెనుమ
ప్రకాశతారలుచూచిన ప్రజలెల్ల దిగులొంది అదరిపడి జచ్చేరుమ
109 శ్రీశైల నాథుడు సాక్షాత్కారముగాను దాసజనులతో మాట
లాడేను శ్రీసుతు వీరవసంతుడొచ్చినని యీసితికంఠుడు బల్కేనుమ
110 మకర మొక్కటిశ్రీశైలానకొచ్చి మరిఎనిమిదిమాసములుండేనుమ
తెగువతో భ్రమరాంబ గుడిలోమేకపోతు తీరుగూసి మాయయ్యేనుమ
111 శ్రీనగమల్లిఖార్జునవీపూరునందూపొగలుమంటాలును యెగసేనుమ
ధ్వనిపుట్టిగురుమూర్తి వింతలుయేడూళ్ళకునువచ్చి నాట్యమునాడేనుమ
112 మల్లిఖార్జునగుడిశిఖరాననిప్పులు ఝల్లుఝల్లుమని రాలేనుమ

కల్లగాదుశక్తి బెబ్బులివలె యుల్లాముప్పొంగి అరచేనుమ
113 గరుడధ్వజము మీాదవక ప్రతిమగూర్చుండి పరిపరిభాషలుబల్కె-
నుమ గురిజాలగుడిముందు నందీశ్వరుడుతోక బిరబిరవిదళించియెగి
రేనుమ
114 నాపుత్రోయఘాలివాక్యములన్నియూడె నగంమీాద నిలిచేనుమ
మృడేశ్వరునినొసలు కంటినమిణుగుర్లు పడిబడివింతగ ప్రాకిపిమా
115 యాదగిరియేటి జలచరంబులన్ని బాగుగభుపిసల్కు-బల్కె-నుమా
సాధువీరయోగి వస్త్రాడనేవార్తభువిలోజంతువులెల్ల పొగడేనుమా
116 కుమారస్వామి గుడివాకిలి ఏడుదినములు మూసుకయుండేనుమా
అమరులందరువచ్చియూవాకిలీదీసి అరవైదినములచటనుండేరుమా
117 యువవత్సరమందుశ్రావణమాసమునయీామ్యదిశలోవింత బుట్టె
నుమ యినుపదారియందునిప్పుగోటకములుబోనఫిరంగులు గాల్చే
రుమా
118 గండిమంయూరుపాకకుబొయ్యేనుగూడూరుమీాదుగయే గేనుమ
దండిగచెంగల్వకోటకుబొయ్యేను యుంమండి దక్షిణమేగేనుమా
119 అంబభ్రమరతాను ఆకలిదీరగ అవనిపతులను ఆరగించేనుమా
అంబరంబులుచూచి ఆవు అరచేను ఆకాశమునబుట్టెనుమ
120 ముక్తికాంతజనులముద్దుబెట్టుమనుచుముందరతావిచ్చినిలచెనుమ
ముక్తికాంతతోడముచ్చటలాడుచుముకుందుడుభక్తులబ్రోచేనుమ
121 భార్గవవత్సర భాద్రపదమునందు-భక్తకోటినిబిల్వనంపేరుమ
దుర్గాలకన్నిట తోరణాలగట్టి దుర్జనులదునిమిా వేసేరుమ
122 మంత్రదేవతకు సంతోషము గల్గెను మహిమీాద పూజలు
అయ్యేను మమంత్రకాళేశ్వరమాధవాగ్రజుని మనసుసంతోషము
చేసేరుమా
123 హంసరూపముచేతహరిసంశయములన్నియుబాపేనుమ
కంసమర్ధనుడు క్షైవల్యముపెడలి కలిదోషముఅడచి గలిపెనుమా
124 కొత్తపేటసంత పురములోనవొక్క-కోతివచ్చి మాటలాడేనుమా
యుత్తరపురాము న్న గట్టుయెక్కి- కోతిప షదినములచటయుండేనుమా

125 కేశవునిస్మరణము జేసినవారెల్ల వాసికెక్కి వసుధనుండేరుమా
పాశుపతాస్త్రము చేతబట్టుకొని భానుమండల పతివచ్చేనుమా
126 రామధర్మజస్వామిరాజముఖునిగూడిరా జైభువియేలవచ్చేనుమా
కాముని జనకుడు కావేటిరంగనికి కనకాభిషేకము జేసేరుమా
127 మీనమీనమని దలచినవారికి మేలైనసంపదలు గలిగేనుమా
మీనరాశిపూజ జేసినవారికి మేఘాధిపతి పదవి గలిగేనుమా
128 నీమముదప్పిన నామధారులెల్ల నీళ్ళకన్న పలచనయ్యేరుమా
సామజవరదుడు వేంచేసినప్పుడు సందుగొందులను దూరేరుమా
129 మున్నూరు వారెల్లముదంతో వుండేరు మొగలాయి దొరతనం
మురిగేను పెన్నయొడ్డునయున్న చెన్నూరువారెల్ల పెనుగొండ
సీమకుబొయ్యేరుమ
130 గ్రామాలు పల్లెలుపట్నాలుఅన్నియుగ్రహపీడనుపాడయ్యేనుమ
కామక్రోధములుబహుళములయ్యేనుకాసుకొరకుకలహమయ్యేనుమ
131 చంద్రపలూరు గట్టినతర్వాత చంద్రగుప్తికి వేంచేసేరుమా
ఇంద్రుడు శ్రీహరిదర్శనానికొచ్చి యిష్టార్థములుగొంచుబొయ్యేనుమ
132 బంగారుపల్లాలు వేసిన గుర్రాలు భక్తితో హరిజేరవచ్చేనుమా
మంగళమూర్తికి మంజమూరువద్దమాన్యాలు ఏడూళ్ళుయిచ్చేరుమ
133 మార్గశిరశుద్ధ అష్టమిమొదలు మహిమీదవింతలు బుట్టేనుమ
మార్గశిరశుద్ధ పూర్ణిమలోపల మగుభారము అణగిపోయ్యేనుమ
134 సంద్యాలచిరువేళ్ళకాలమృత్యువుచేతనాసనమైప్రజలు బొయ్యే
రుమ
ఇందుముఖులుతమయిరువులువిడిచేరుయిచ్చావిహారముగ తిరుగే
రుమ
135 కొల్లాపురమువద్ద కోడుమూరుధన మకోట్లుడె భైరైయేదు దీసేరుమ
కల్లమాటలుగాపుపాండురాజుచేత కనకమంతబుచ్చుకొనియేరుమ
136 కమ్మనన్న పనులెల్లఘుడియలోనయ్యానిమ్మలహరిఇస్తూ డొచ్చే
నుమ ముమ్మాటికిమాట నమ్మినవారిని ముకుందుడూరక్షించేనుమ

137 ఖేరికోమల్లెల్ల జయమునవుండేరు పెద్దలుకొందరు నిలిచేరుమ
ధారుణీమీదనుధర్మాత్ములకునెల్ల దయచేసిసంపదలిచ్చేరుమ
138 కాలమృత్యువును దండించి ముందర కరుణతో సజ్జనులగాచేనుమ
నీలతోయదమధ్యముననున్న శ్రీహరి నిరతముఃదరిశనమయ్యేనుమ
139 శయనాధిపతియైన శ్రీ కేశవస్వామి సేవకూపిల్వ నంపేరుమ
శ్రీనివాసునకు దివ్యాభరణములు శీఘ్రముగ బెట్టి పంపేరుమా
140 నూటఎనిమిది తిరుపతులలోపల మేటవేల్పుపూజ నడచేరుమ
కోటిబ్రాహ్మణులకు నిరతాన్నదానముకోరినట్లు బెట్టించేరుమ
141 వేదాద్రిజూడగ కోవెలకుంటలకు వీరధర్మజులు వచ్చేనుమా
ఆదికేశవునకు హలపరాతాయతు అప్పుడేముంజేత గట్టేరుమా
142 నీలగిరివారు దివ్యభూషణాలు నీరజాక్షునకు దెచ్చేరుమ
మేలయినచెంగల్వకోటవారువచ్చి మేలునాణ్యముదెచ్చిఇచ్చేరుమ
143 గాయత్రిపురివారు కామజనకునకు కానుకల్ బహుగాను దెచ్చేరుమ
మహావీరనాధునకు ద్వారకాపురి వారు మాణిక్య హారాలు
ఇచ్చేనుమ
144 కపిలధేనువులు ఘనముగపితికేను కల్పవృక్షముఫలము లిచ్చేను
జపియించినప్పుడే జనశుద్ధిఅయ్యీని జాంబవామణి సంతసిల్లేనుమ
145 అడ్డకూవకయావుపూకకువక ఎద్దుహాయుమువక హారణనకమ్మేనుమ
బిడ్డలులేనట్టి గొడ్డాండ్రకడుపున బిడ్డలుముందర బుట్టేరుమా
146 చూడకుఏనుగమహిమీదఅమ్మానిఏడుమాడలమాడనడచెనుమ
మూడులోకములెల్ల ముదమందుచుండగ వేడుకతో స్వామి
వచ్చెనుమ
147 శ్రీదేవిసతతము శ్రీవీరధర్మజులసేవజేసి పూజపత్పేనుమ
భూదేవిఎప్పుడు పుండరీకాక్షునిపొగడుచు వుప్పొంగి యుండెనుమ
148 బాటలోపల మల్లిఖార్జునిసన్నిధిని బంగారుసురటీల విసరేరుమ
అటనుండిబెల్లము కొండకువచ్చియు అరుకోట్లధనము దీశేరుమా
149 ఆనందగురువులుద్రవ్యముదీయించిఅన్నదానముబహుగజేసేరుమ
ఆనందముచేత రాచవ్యదగ్గెర అర్ధమంతయు వెళ్ళదీసేరుమా

150 ఆగరాన మూడుశంఖాలద్రవ్యము ఆర్తులకోసము దీసేరుమా
సాగరశయనుడు సరసిజముఖిగూడి సంతోషముచేత వుండేనుమా
151 వీరయోగిస్వామి విజయచరిత్రమువిన్న వారికి భాగ్యమిచ్చేనుమ
కోరినకోరిక సఫలమయ్యేటట్టు గోవర్ధనోద్ధారు డిచ్చేనుమా
152 వీరనారాయణ పురమునుగట్టించి వెంకటాద్రివశము జేసేరుమ
ధారుణిదేవి దయతోడపాలించి మేరమర్యాదలు నడిపేరుమా
153 భూరిచతుర్దశ భువనములన్నియు భోగేంద్రశయనుడు ఏలేనుమా
సారమయిన సామవేదాథర్వణాము సాంగముగ ముందునడచీనిమా
154 నారాయణశాస్త్రము వారికెక్కించీని నలువంకలధ్వని జేసీనిమ
క్రూరమైనవారి కులమెల్లనణచీని గోబ్రాహ్మణుల రక్షించేనుమ
155 అక్షయ శాణాలు పక్షివాహనుడు ఆదరమున సుతునకిచ్చేనుమా
శిక్షించుమని శత్రుసమూహమెల్లను సేనాధిపతితోడ జెప్పేనుమా
156 తంత్రికొమరుడు దరిశనమైతేను ధరణిశాపముచల్లనయ్యేనుమ
తంత్రితనబిడ్డను తనవారికిచ్చీని తద్యాము-ఈమాట తప్పాదుమ
157 ఇందిరాపతిరూపమైన మాసమందు ఇహాముఅంతా తల్లడించీనిమ
ఇందువారము శుద్ధత్రయోదశినాడు ఇష్టమంత్రముచేత బుట్టీనిమ
158 బ్రహ్మవేత్తలను వెంటబెట్టుకొని బ్రహ్మాస్త్రముదీసుకొచ్చీనిమ
బ్రాహ్మణవేషాలుఅప్పుడుమార్చేరు బ్రాహ్మణాకులముద్ధరించేరుమ
159 మాణిక్యమేసిన బంగారుపతకము మామ అల్లునకు యిచ్చేనుమ
ఆణిముత్యములహారాలు దెప్పించి ఆదికేశవునకు ఇచ్చేరుమ
160 సంగీతలోలుడు సనకాదివంద్యుడు సాకేతపురివెడలి వచ్చీనిమ
బంగారుజలతారు వేసినకోకలు భక్తకోటులకై ఇచ్చీనిమా
161 పాపవిదూరుడు భవరోగవైద్యుడు భానుమండల నివాసుడును
శాపదగ్ధులకు శాపముపోగొట్టి శరణుజొచ్చనవార్ని గాచీనిమా
162 పాంచాలకులములో భక్తులబహుగానుపరయోగమా వెంబడవచ్చే
రుమ కంచిఅహోబిలస్థలమందువారికి అభయమిచ్చి రక్షించేరుమా
163 ఆనందగురువులకు కనకాభిషేకము అపుడుధర్మజులు చేసేరుమా
ఆనందముచేత హరికల్కిరామునకు అలాగెసంతోష పెట్టేరుమ

164 కడగండ్లువచ్చీని జనులకుముందర వడిగండ్లవానలు గురిసీనిమా
కడగండ్లదగ్గర ఆలమూరివద్ద బహురాజకార్యాలు అయ్యేనుమ

165 సారాముదప్పి నిశ్నారాము అయ్యానివారవారమువింత బుట్టీనిమ
వీరవసంతుని విభవముఅయి తేను విరివిగ ప్రజవిస్తరిల్లీనిమ

166 నక్కలుపూరూరదివమందు గూసీనికుక్కమూతికితోక బెట్టీనిమ
ముక్కులుగోసేటి వానిదేశమంత ముక్కిపోయెమురికి లేచీనిమ

167 ఆదవేణిఘోనుగజములధ్వనిబుట్టి అత్తలకుకలహములుఅయ్యానిమ
బాదామితోవోరుగలుదట్టిన ఋూదబంకాపురపుగట్టుకొనియెరుమా

168 ఆదవేణినుండి తర్లివచ్చినదందు అరెకొండనూతూర్పు నడచీనిమ
ఆదవేశీసీను నడియేటగలిసీని అలాగేకందనూరయ్యేనుమా

169 గుఱ్ఱముజెప్పిన మాటలుదప్పవు గురిదాకిదృష్టాంత మయ్యేనుమ
వెఱ్ఱిపంపుచేత కందనూరుసీమ యధ్యతథ్యమయి పొయ్యానిమా

170 మధ్యపానముచేత మహిమీదకొందరుగుద్దులాటకు లేచివచ్చేరుమ
గద్దెసుద్దులుజెప్పి కాలముగడిపేరు విద్యాలతో విఱ్ఱవీగేరుమా

171 కాలపరిపక్వము జనులకు ముందర కార్తీకమాసమున వచ్చీనిమ
బాలచంద్రుని కాంతిగానకపొయ్యేరు భానుకాంతులుఅణగిపొయ్యా
నిమా

172 భావులలోపల కూతలుబుట్టీని పట్నాలలోలక్ష్మివడ్చీనిమ
కావరించినవార్ని ఖండించువేసేరు కర్మనిష్ఠులగారవించేరుమా

173 ఘనమైనవజ్రాలుయాగంటిమొదలుగ గాడికంబముదాక వుండీనిమ
దినకరతేజుడు తీయించిముందర దేవబ్రాహ్మణులకు యిచ్చేనుమా

174 రుద్రసీమలోన వున్నట్టిమనుజులు రూపవిహీనులయి పొయ్యేరుమ
రుద్రుడు కరుణాసముద్రుడు భక్తుల భద్రముతోడుత గాచేనుమా

175 ముత్యాలుపగడాలు కాసుకుఅమ్మినిసత్యాలుభువినేలవచ్చేరుమ
అత్యంతప్రీతితో అతివలుపురుషులు నిత్యమాందులయివుండేరుమా

176 గుగ్గిళ్ళరాయుడువచ్చేనుదుష్టుల గుండెలెల్ల ఆవటిల్లెనుమ
దగ్గరచూపులు చూచేటివారెల్ల బగ్గపటలమై పొయ్యేరుమా

177 రుద్రుడు కాలాగ్ని రుద్రుడు శ్రీవీరభద్రునిభువిమీద కంపేరుమ

రుద్రుడై శూద్రుల రుద్రభూమికంపి బుద్ధిగల్గినవార్ని విడచీనిమా
178 వీరసింహుడైన వీరధర్మజస్వామి విశ్వముపాలించిన వచ్చీనిమ
దూరదృష్టి లేశమైన యెరుంగని దుర్మార్గులను శిక్షించేరుమా
179 సద్యోఘృతపాయసాన్నంబ్రాహ్మణులకుసర్వకాలములనుబెట్టేరుమ
సద్యోగర్భమయినతొమ్మిదిఘడియలకుసంతానముత్పత్తిఅయ్యేనుమ
180 తొమ్మిదిఝాములకు శూద్రులవుత్పత్తిదుష్టులుదుర్గతిబొందేరుమ
తొమ్మిదిదినములకుపశువులుయీనేనుదుష్టన్ప్రుగములునష్టమయ్యే
నుమ

181 గోదావరితీర వాసులబిలిపించి గోదానములుచాల యిచ్చేరుమ
ఆదరించి దేవబ్రాహ్మణులకు అనేక అగ్రహారములు యిచ్చేరుమ
182 మకరకుంభమీనరాసులలోపల ప్రకటముగ ప్రకాశ మయ్యేరుమ
ప్రకటముజేసెంత జెప్పిన ప్రజలకుప్రారబ్ధము తెలియునియ్యారు మా
183 సన్నవీరణాల వాయిద్యములతోడ సార్వభౌముడుతర్లి వచ్చేనుమ
సన్నుతిజేశేరు సకలమయినవారు సాష్టాంగదండములు బెట్టేరుమ
184 పింగళాబముల అంగజజనకుడు మంగళస్నానము చేసేనుమ
బంగారుపువ్వుల రంగనిపూజించి పట్టాభిషేకము అయ్యానిమ
185 పూరపూరరచ్చ కొట్టాలుగాలీని పూరివాకిటమృత్యునిలచీనిమ
మేరజనులనెల్ల మన్నించుచుండీని మేరమీరినవారిని భ్రమింగేనుమ
186 ఏనుగుతలశాయ వానికర్మముల ఏకమయిపో మంటవెళ్ళినిమా
జ్ఞానులకుమెల్ల గరిబుకనిలిచీని కన్నడీలునష్ట మయ్యేరుమా
187 దివిభువినడుమను దేవుడువున్నాడుదివిజులందరుఅందువున్నారుమ
నవనీతచోరుడు నాదబ్రహ్మమెపుడు నాయందుబల్కుచున్నాడుమ
188 నాదబిందుకళల నడిమింటలున్నాడుఆది దేవుడుఅందువున్నాడుమ
ఆదికేశవుడు అభయములివ్వను ఆనందగురుపుత్రుడొచ్చీనిమ
189 గంగాధరునిదర్శనము జేయవచ్చేరు గంగయమువలు పుష్పింగే
నుమ

తుంగభద్రాతీరమున ముగ్గురునుగూడి శృంగారముగను పలేరుమా
190 పాతాళగంగలో నీటినికిపొయ్యేను భూతలంబునమంటలెగసీనిమా

నీతిమంతులుతరలి వచ్చేరుమముందర పాతకూలుమడసి పొయ్యే
రుమా

191 సంగ్రామములోగద్దలాడినందులకు సకలమయిన దొరలువచ్చేరుమ
అంగజహరుడైన మల్లిఖార్జునుడు అపుడుప్రజలతో మాటలాడేనుమ
192 వారధులినికిని వసుధపాడయ్యాని తారలుభూమిమీద రాలీనిమ
వీరాధివీరుల వేంటబెట్టుకుని వీరధర్మజస్వామివచ్చేనుమా
193 బృందావనంమహిమ భృగిమునిఎరుగను ముందరబహుపూజజర్గే
నుమ

నిందాకులమువారునాశనమయ్యేరు నిజమయినసుజనులునిలచేరుమ
194 మందరధరుడైన భానుమండలపతి మహిమ ఎవ్వరికిని తెలియదుమ
సందేహము లేదు సామగానప్రియుడు సాధులరక్షించ వచ్చేనుమ
195 పద్మసంభవుడు చెప్పినభవిష్యత్తు పద్మపురాణములో వున్నాదిమ
పద్మనాభుని తావు పద్మసంభవువలన పద్మనాభుని పేరువున్నాదిమా
196 గోపిదేవిని పెయ్యదూడలసహితము గోవిందుడు దెప్పించెనుమ
దాపుకుతాజేరి ముందరభక్తులదయతోడ రక్షణ జేసీరుమా
197 వేల్పూరిలోన వెంగభోట్లుగార్ని వేడుకతో పిల్వనంపేరుమ
వేల్పులబాగడగకూర్మసింహాసనమువీరధర్మజస్వామి యెక్కేనుమా
బాణాలబసవయ్యనుముందుముందుగనువాలాయముగ బిలువనంపేరుమ
వీణవాయిద్యము విస్తారమయ్యాని వేదాంతవేద్యుడు వచ్చేనుమా
199 భరతునిశాపముచేతనుశూద్రులభాగ్యదేవతతొలగిపొయ్యేనుమ
నిరతముగురుసేవ జేసిన శూద్రునిత్యులై కొందరు నిలచేరుమ
200 రామధర్మజస్వామి లంజలపోలూరి రామయ్యనుబిల్వ నంపేరుమ
ప్రేమతోరుద్రాజి రామోజిగారిని పిల్వనంపి ప్రీతి జేసేరుమా
201 భేరికేశవులను రక్షించివచ్చేరు భేతముచర్లకు జేరేరుమ
పేరులనందరిని రక్షించి ఓంకార నాదమందిరికి దెల్పేరుమా
202 కుండలీశయనుడు ఘోటకమునెక్కి కూర్మగిరికి జేరవచ్చేనుమ
కొండయనుచు తెలుగుజంగాన్ని శీఘ్రమునకొడుకుపెండ్లికిబిల్వనంపేరుమ
203 వనితలుపురుషులు ఆజ్ఞలోవుండేరు వసుధయిష్టార్థములిచ్చేనిమ

సనకసనందన సనత్కుమారులు సర్వోత్తముని వెంట వచ్చేరుమా
204 దేవదుందుభిధ్వని దివిభువినిండీని దేవాదిదేవుడు వచ్చెనుమ
దేవతాపూజలు పూమరజరిగేను దేశాలుస్వస్థమై వుండేనుమా
205 చంద్రమాసాబ్దములు వెళ్లినమీదట జ్ఞానవిజకుడు వచ్చీనిమ
సాంద్రసింధూవేదముదయించి నామీదసాధూలు సంతోషమయ్యే
రుమ
206 దోడైనతిరునాళ్ళ దోచుక పోయేరు దుర్దేలదుదాండ్ల కమ్మేరుమ
వడ్డెరాజ్యములు వలసలుబోయ్యేరు రుద్దేలదొరతనముఃలయ్యీనిమ
207 అరికాటివారు అవనిలో గలిసేరు అరణిఅధ్వాన్న మయ్యీనిమా
ఆరువేలవారు అడవిపాలయ్యేరు ఆలాగెకన్నడి లయ్యేరుమ
208కోమిటివారెల్లకులక్షయమయేరుగొప్పపట్నాలుకొల్లబొయ్యీనిమ
క్షేమముతో పాంచానకులమెల్లబువిలోన శ్రీకరంబుగనిలచి వుండే
నుమ
209 కానికులములు రెండు పింజారికులములుగాలిగాబారుగా వుండీనిమ
కోనసీమంతయు కొల్లవాడయీని కొండవీడుకొల్ల బొయ్యీనిమా
210 సిద్ధాపట్టానకు శ్రీరామధర్మజులు శేనాలతో వచ్చెనుమ
సిద్ధాంతిశిరోమణియైనగురుస్వామి సిద్ధాంతమునిత్య మయ్యేనుమా
211 కంగోణిదుర్గము కాటమరాజుకు కర్రెతావులబసవ డిచ్మెనుమ
కంగోణినావలజ్ఞాన్నావిస్థానమును కరణివీరయోగి ఏలెనుమ
212 దేశములోపల మహాత్ములందరు దేవికడుపులోన బుట్టిరుమ
వాసిగషణ్మతగురువును నేనేనారాయణునినామం దేనానుమా
213 వరగవీరయోగి భానుమండలపతి భావములోపల నేనేనుమ
పరవీరయోగి వాక్యాలలోపల భావమంతయును నేనేనుమ
214 భక్తులందరుమీరునిజముగవుండేటి పాలంచనుమేము వచ్చేనుమ
శక్తుడయినయట్టిభానుమండలపతిస్వామిమిముదయజూడవచ్చేరుమ
215 మధురమీనాక్షమ్మ మాడాలుఆడీని మహినిఅద్భుతాలుబుట్టీనిమ
మధుసూదనస్వామి మహిమచేతభువినిమాయవాదులణగి పోయ్యే
రుమ

216 పెనుగొండమచాల ద్రవ్యమున్నది పెంపుచేతను దీయించేరుమ
దనుజసార్ధనుడు అముచానగరములో ధనముఅంతాదీయించేరుమ
217 కటకానబహుగ ద్రవ్యమున్నది కమలనాబుడు దీయించీని మ
ప్రకటాముసుతను ఆరాజ్యములో పైబడి బుచ్చుకొనేరుమ
218 పనులెల్లఘుడియలో అయ్యాని ఇమ్ములహరి ఇపుచువచ్చీనిమ
ముమ్మాటిగ మాటలు నమ్మితే ముకుదుంపు రక్షించేనుమ
219 నెల్లూరసీమంతనిర్మలమయ్యేని నిడిగల్లు నిర్ఘాతమయ్యానిమ
కల్లూరుగలబరిగిగాభరాఅయినిమొల్లముసాయిబులుముణిగేరుమ
220 రాగాముపన్యాలీగట్టినమీదట సోనూరుశీఘ్రమే గట్టెరుమ
నగరమువారెల్ల కులనాశనమయ్యేరు నాడేమజగములు అయ్యా
నుమ

221 భానుమండలపతి భాగ్యసంపన్నుడు భక్తులపాలింపవచ్చేరుమా
భానుముక్కులయ్యబెద్రుకొండయ్య గుడియంతబంగారుపూయించే
రుమ

222 ఫణిభట్లుగారికిపౌరోహితమిచ్చి బహుమానముతో నడిపేరుమ
ఫణిరాజుబాగడగ త్రిశూలఢమరుకము భగవంతుడూపట్టుకొచ్చీ
నిమ

223 ఘనమునవజ్రాలయోగంటిమొదలుగ గండికంచురధము దెచ్చేరుమ
ఇనకరతేజుడుదీయించిముందర దేవబ్రాహ్మానికిచ్చేరుమా
224 ముండమోపులెల్ల కన్నెలుఅయ్యేరు ముదముతో భువిఏలుచుండే
రుమ

ఎండవెన్నెలరెండుసమముముగనయ్యానియోగాలుబహుగానుజేసేరుమ
225 ఆనందగురువులుఆదికన్యారాముడు భానునందికి జేరవచ్చీనిమ
ఆనందముచేత వారి కేశవులను ఆశీర్వాదములు జేసేరుమ
226 రాచూరివద్దనురాజీకమయ్యాని రాజాధిరాజులురాలేరుమ
ఆచారవృత్తితోఆనగొందివారు యతివేషమువెళ్ళిపొయ్యేరుమ
227 నాగయ్యఅనిఎటి ఏడేడ్ల బాలుడు నాలుగువేదాలుచదివీనిమ
బాగుగబనగానిపల్లెపట్నమయ్యానిభాగ్యముతో వాలలాడినిమా

228 నెలకుమూడ్వర్షాలు గురిచితప్పక నీమంబుతో ప్రజలునడిచేరుమ
యిలలోనధర్మమువిస్తారమ్యాని యిందిరాపతియాజ్ఞ నడచేనిమా
229 రూకకుపుట్టెడుధాన్యము తర్వాత పోకకుపుట్టెడు అయ్యానిమ
లోకములో అన్నముగలిగి వర్ధిల్లీని లోకులుచల్లగ నుండేరుమా
230 ఏనూరుకోట్ల భుమండలంబులు ఏకచక్రము ఏలేరుమ
భానుమండలమందువుర్భవమయ్యేరుభానునందికి ప్రవేసించేరుమా
231 విశ్వకర్మనిర్మాణముచేతను విజయనగరము విస్తరిల్లేనిమ
విశ్వవ్యాపకుడైనవీరధర్మజస్వామి విజయనగరమందు వుండేరుమ
232 చలంజర్లనద్ద బలనులుకూడీని జగడాలులావుగ అయ్యానిమ
ఇలలోనఇమ్ముగ యువచేడియలు రెండువినువకజయంలుపొందేరుమ
233 అగరాముగొల్చీని యగుపారజూచీని ఆకాశముఎర్రనయ్యానిమ
బాగుగనగరివారు వాలాయముగను వసుధాస్థలియందువుండేరుమ
234 కాశీలో గంగస్నానముజేసి తే దోషములె బాసిపొయ్యేనిమ
నాశికాగ్రమందు చూచేటివారికి కేశవునిదర్సన మయ్యానిమా
235 రామేశ్వరంవద్దరణరంగమయ్యానిరాష్ట్రాదిపతులెల్లమడిశేరుమ
కామాక్షితల్లియు కన్నులుదెరచీని కరుణించి భక్తులగాచీనిమా
236 హంబీరదేవతనారాధించినవారికిష్టమయినఐశ్వర్యములుగలిగీనిమ
ఆ బభ్రమరాంబ ఆకలిదీరక ఆరానిసానార గించెనుమా
237 ముక్తికాంతజనులు ముద్దుబెట్టామని ముందరావచ్చి నిలచేరుమ
ముక్తికాంతితోటిముచ్చటాడుచుముకుందుడుముందరవుండీనిమా
238 రాయదుర్గానకు ర్యాఘ్రచిలుకవచ్చి ర్యాఘ్రధర్మజువార్త జెప్పేనుమ
పాయకట్టుపశువెలవద్ద ఏడేండ్లపడతికి పిల్లలుబుట్టేనిమా
239 చిత్రకలుననువిచిత్రాలుబుట్టేనిక్షత్రియకులనాశనమయ్యానిమా
మిత్రుద్రోహులెల్ల మీనాంకమునందు మేదినిలో నష్టమయ్యేరుమా
240 గురికొని ముష్కాళ్ళుగుర్రముకొండలో కౌమారబో గుంచాడినమ
ధరణిలో కందర్పకొండగుహాలలోన గావోదరుడు ప్రవేశించేనుమ
241 ఉదయమాద్రిగిరిమీదసంజీవియుండిని వుత్సాహమునదెప్పించెరుమ
బదరికాశ్రమమును వుండేటిపెద్దలు భగవద్దరిశనానికొచ్చేరుమా

242 శేషాద్రిసరసయగారిముందర శీఘ్రముమేసిలువనంపేరుమా
శేషాద్రినరసయ్యగారిపిలువక ముందేసృష్టికి చీకట్లయ్యానిమ
243 వికారియాడేసి విష్ణునామముమీాద వీరధర్మజస్వామివచ్చెనుమ
వికారిమూడారువెళ్లినమీాదట వేఙునాథు ౹ ప్రకటమయ్యానిమ
244 కూర్మగిరివద్దగుడార్లువేయించి కొనకుస-డ్లి అంగుచెసేరుమా
కూర్మగిరినించిగంధర్వులువచ్చి గానము అచ్చట చెసేరుమ
245 కపిలదేనువులుఘనముగపిండిని కల్పవృక్షముఫలములిచ్చీనిమ
జపియించినప్పుడేజపశుద్ధిఅయ్యాని జాంబవతీసంతునిలచీనిమ
245 మీానరాశిని శనిప్రవేశమైతేను మ్లేచ్ఛాలునాశనమయ్యేరుమ
పూనిదండివద్దశనియు నిలచితేను భూభారమెల్లను అణగీనిమ
247 వృషభరాశినిప్రవేశమైతేను వృద్ధులు బాలులుఅఘమేరుమా
విషగాలివచ్చీ ఈశాన్యమునుంచి విపరీత నరులకు విసరీనిమ
248 మకర మందుగురుడుప్రవేశమైతేను మతములన్నీగతములయ్యా
నిమ ప్రకటముచెతను పెన్నదాటి దండు పెండ్లికొడుకు చేరవచ్చీనియా
249 తేలుమీాదగురుడుప్రవేశమయితేను దేశాలుఅసి.డ్ఘుగట్టేరుమా
వాలాయముగను వర్షాలుగురిచీని వసుధలో పంటలు పండినిమా
250 మీానమందునగురుడుప్రవేశమైతేను భానుతేజునివట్న మయ్యా
నిమ
భానుమండలపతి పాలించిజగములుభాగ్యము భక్తులకిచ్చీనిమా
251 జలములు యినికీనిజగములువణకీని జనులుచాలకష్టమయ్యేరుమ
అలవిగానిదండు అర్థముకొరకై ఆనగొందిసీమ చేరీనిమ
252 సూర్యనందివద్దశోభనమయ్యాకసుజనులందరుఅట కొచ్చేరుమా
కార్యకారణాలు ఘడియలోనయ్యానీకలిదోషములుఅణగిపోయ్యా
నీమ
253 పాండురంగస్వామిప్రాకారగోపురము పసిడినీరు బోయించేరుమ
పుండరీకాక్షుడంబుజగేంద్రశయనుడా భూమిపుత్రులు వుదయించెరుమ
254 పాణీకోన సాదుకేశ్వరున సన్నిది వీణాధ్వని వినబడీనుయే
వాణివిజయమున వారిజాక్షుడును వాసుదేవునికొల్వచేసినిమ

—0—

## పుస్తకములు దొరుకుచోటు

1. సి. వి. కృష్ణా బుక్ డిపో, మదరాసు.
2. యన్. వి. గోపాల్ అండ్ కో., మదరాసు.
3. వాణీ బుక్ డిపో, ట్రంకురోడ్డు, నెల్లూరు.
4. చల్లగుండ్ల లక్ష్మయ్యగుప్త, ట్రంకురోడ్డు, ఒంగోలు.
5. డి. ప్రకాశరావు, బుక్ సెల్లర్, తెనాలి.

♦ ♦ ♦ ♦ ♦

6. షేకు అల్లీసాహెబ్, రైల్వేస్టేషన్ రోడ్డు, తెనాలి.
7. సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.
8. రంగా కృష్ణమూర్తిగారు, బెజవాడ.
9. ఎః బిల్లి నాగేశ్వరరావుగారు, బెజవాడ.
10. కొండపల్లి వీరవెంకయ్యగారు, రాజమండ్రి.
11. కాతు చంద్రయ్యగారు, రాజమండ్రి.
12. గొల్లపూడి వీరాస్వామిగారు, రాజమండ్రి.
13. జవంగుల నాగభూషణం అండ్ సన్సు సత్తెనపల్లి.
14. ఆలమూరు ఆదిశేషారావుగారు, గుంటూరు.
15. వంకాయలపాటి నాగభూషణం అండ్ సన్సు, గుంటూరు.

---




ఈశ్వర ప్రింటింగ్ ప్రెస్, తెనాలి.